# నిర్మాణ సమస్యలు



స్టాలిన్

ప్రజాశక్తి కార్యాలయం
బెజవాడ.

# నిర్మాణ సమస్యలు

స్టాలిన్

అనువాదం
కంభంపాటి సత్యనారాయణ
(జూనియర్)

# పరిచయం

లెనిన్‌చే స్థాపించబడిన 'క్రొత్తరకం పార్టీ' సోవియట్ ప్రజలను అనేక కష్టాలనుండి దాటించి సోషలిస్టు నిర్మాణ విషయంలోగాని ఈనాడు ఫాసిస్టులను ఎదిరించి నాశనముచేయుటలోగాని ముందుకునడిపి మహత్తర విజయాలను సాధించింది. ఆపార్టీనే కమ్యూనిస్టుపార్టీ అని పిలుస్తున్నాం. కమ్యూనిస్టుపార్టీ యొక్క ప్రధాన నిర్మాణసూత్రాలనుగురించి మొదట లెనిన్ తన "ఒక అడుగు ముందుకు రెండడుగులు వెనక్కు" అను గ్రంథంలో తెలియజేశాడు. ఈ నిర్మాణసూత్రాలను అభివృద్ధిచేస్తూ స్టాలిన్ తన "లెనినిజమ్ యొక్క ప్రధాన సూత్రాలు" అను గ్రంధంలో విపులీకరించాడు. అన్ని దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు ఈ నిర్మాణసూత్రాల ననుసరించి పనిచేస్తున్నాయి.

ఈ చిన్నపుస్తకంలో నిర్మాణసమస్యలనుగురించి కామ్రేడ్స్ స్టాలిన్, కగానోవిచ్, డిమిట్రావ్ ఇచ్చిన-రిపోర్టులలోని ముఖ్య భాగాలు ఇవ్వబడినాయి. 1934 లో జరిగిన 17 వ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సమావేశంలో నిర్మాణసమస్యల మీద కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చిన రిపోర్టునుంచి, 1935 లో ఎర్ర సైన్య కళాశాలలనుంచి పట్టభద్రులైనవారికి స్టాలిన్ ఇచ్చిన ఉపన్యాసమునుంచి కొన్ని భాగాలు మొదట యివ్వబడినాయి. తరువాత 1939 లో 18 వ సో. యూ. క. పా. సమావేశంలో స్టాలిన్ రిపోర్టునుంచి కాడర్ల సెలక్షన్, ప్రొమోషన్ నియామకాలను గురించిన భాగాలను, 1937 లో సో.యూ.క.పా. కేంద్ర

కమిటీ ప్లీనమ్ సమావేశంలో ప్రాక్టికల్ కార్యక్రమం మీద స్టాలిన్ యొక్క ముగింపు ఉపన్యాసంలోని భాగాలు యివ్వబడినాయి. తరువాత కగానోవిచ్, డిమిట్రావ్‌ల రిపోర్టులలోని భాగాలు అనుబంధాలుగా చేర్చబడినయి.

నిర్మాణసమస్యలనుగురించి ఉత్తమ పార్టీనాయకులు చెప్పే ప్రధానసూత్రాలు ప్రతిఆర్గనైజరుకు తన పార్టీ నిర్మాణబాధ్యతలను చక్కగా గుర్తింపచేయగలవనే ఉద్దేశ్యంతో ఈచిన్నపుస్తకాన్ని అనువాదం చేయడం అయింది. జాతీయైక్యతకై పోరాడే కామ్రేడ్స్, తమ పార్టీ నిర్మాణ అయిక్యతను గూడా పెంపొందించి దిట్టపరచవలసియున్నది. అందువల్ల ఈపుస్తకంలో చెప్పబడిన బోల్షివిక్‌ల నిర్మాణ అనుభవాలు మన ఐక్యతా నిర్మాణ పోరాటంలో ఎంతో ఉపయోగపడగలవు.

— అనువాదకుడు.

# నిర్మాణ సమస్యలు

సరియైన పార్టీపంథాను నిర్ణయించి, దాన్ని ప్రణాళికలరూపం లోనూ, తీర్మానాలరూపంలోనూ హడావిడిగా ప్రకటించేసి, దాని మీద వోట్లు తీసుకొని, యేకగ్రీవంగా నెగ్గించేస్తే సరిపోతుందని కొందరి అభిప్రాయం. అలాచేస్తే విజయం దానంతట అదే ఆకస్మికంగా చేకూరుతుందనికాబోలు వారి భావం! ఇది శుద్ధ తప్పు అని వేరుగా చెప్పనక్కరలేదు. అంత సులభంగా విజయం రాగలదనే భ్రమలోవుండి. వారినేవారు మోసగించుకుంటు న్నారు. నిజానికి విజయాలు ఆకస్మికంగా వాటంతటవే వచ్చేవి కావు. పార్టీపంథాను వర్తింపచేయుటకై సాగించవలసిన తీవ్రమైన పోరాటాల ఫలితంగా విజయాలు సమకూరతాయి. అనగా విజయాలను సాధించవలసిన ఆవసరం ఉన్నదని గుర్తించాలి. సరియైన తీర్మానాలు, ప్రకటనలు - ఇవన్నీ ప్రారంభదశలో జరిగేవి. అంతే. ఇవన్నీ విజయం కావాలనే కోరికనుమాత్రమే సూచిస్తాయి. సరియైన పార్టీపంథాను నిర్ణయించిన తరువాత, సమస్యను పరిష్కరించే మార్గాన్ని కనుగొన్నతరువాత, కార్యక్రమాన్ని నిర్మాణయుక్తంగా సాగించే పద్ధతిమీదనే. విజయం ఆధారపడి వుంటుంది. పార్టీపంథాను వర్తింపచేయుటకై సాగించవలసిన పోరాటాన్ని ఆర్గనైజ్ చేయుటమీద, బాధ్యతవహించగల వ్యక్తులను సెలక్టు చేయుటమీద, నాయకత్వంవహించే కమిటీల యొక్క నిర్ణయాలు సరిగా అమలుచేయబడుతున్నదీ లేనిదీ తనిఖీ చేస్తూ చెకప్ చేయుటమీద విజయం ఆధారపడివుంటుంది. ఇవి

చేయనియెడల సరియైన పార్టీపంథా, సరియైన పరిష్కారమార్గాలు తప్పుతోవలనుపట్టే అపాయపరిస్థితి యేర్పడుతుంది.

అంతేకాదు: సరియైన రాజకీయ పంథా నిర్ణయించబడినతరువాత, అంతా నిర్మాణ కార్యక్రమంమీదనే ఆధారపడివుంటుంది.

చివరికి రాజకీయపంథా సఫలించేదీ లేక విఫలమయేదీగూడా నిర్మాణ కార్యక్రమంమీదనే ఆధారపడియున్నది.

యదార్థంగా గత విజయమంతా యెలా సాధించగల్గాం? పార్టీ పంథాను వర్తింపచేయునప్పుడు నిరోధకంగా తయారైన యెన్నో కష్టాలను యెదుర్కొనుటకై యెడతెగనటువంటి తీవ్ర పోరాటాలను సాగించి ఆ కష్టాలను దాటగల్గినందువల్ల; ఆ కష్టాలను దాటుటకై పార్టీని కార్మికవర్గాన్ని సమీకరించినందువల్ల, ఆ కష్టాలను యెదుర్కొనుటకై పోరాటాన్ని ఆర్గనైజ్ చేయుటవల్ల, నిర్వహణాశక్తి లేనటువంటి కార్యనిర్వాహక వర్గాలను (executives) తొలగించి వాటి స్థానే శక్తివంతమైనవాటిని యెన్నుకొనుటవల్ల యింతకాలం విజయాలను సాధించాం.

అయితే యివి యెటువంటి కష్టాలు? ఇవి ఎక్కడ బయలుదేరతాయి?

నిర్మాణ కార్యక్రమానికి, దాన్ని నడిపే నాయకత్వమునకు సంబంధించిన కష్టాలు యివి. మనలో, మన నాయకులలో, మన సంఘాలలో, మన పార్టీ నిర్మాణంలో, ప్రభుత్వ యంత్రములో, ఆర్థిక సంస్థలలో, ట్రేడ్ యూనియన్లలో, యంగ్ కమ్యూనిస్టు సంఘంలో, యింకా యితర సంస్థలలో యీ కష్టాలన్నీ బయలుదేరుతున్నాయి.

పరిపాలనా విధానంలో అధికార నిర్వహణా పద్ధతులు; నిజమైన నాయకత్వానికి బదులు యేదో ఒక 'జనరల్ నాయకత్వము'ను గురించి వృథా ప్రసంగం; మన సంస్థలయొక్క

ఫంక్షనల్ నిర్మాణం, వ్యక్తులకు బాధ్యత లేకపోవుట; పనిలో వ్యక్తి బాధ్యత లేకుండుట; సమాన అలవెన్సులు; ఆత్మవిమర్శన చేసుకొనుటకు భయం - ఈ సమస్యలలోనుంచి కష్టాలన్నీ బయలు దేరుతాయి. ఇక్కడేవున్నాయి మనం ఎదుర్కోవలసిన కష్టాలన్నీ.

ఈ కష్టాలను కేవలం తీర్మానాలద్వారాను, నిర్ణయాలద్వారాను దాటగలమని అనుకొనుట పొరపాటు. అనుభవం లేనందువల్ల అలా అనుకొనుట తటస్థించుతుంది. మాటలలో నిర్ణయాలను గావించి, ఆ నిర్ణయాల నన్నిటినీ ఆఫీసు డ్రాయర్లలో భద్రంగా దాచివుంచే విధానంలో అధికారవర్గాలు అగ్రస్థానాన్ని వహించారు. నిర్ణయాలయందు వారికిగల భక్తిని ప్రదర్శించేమార్గం యిదే!

ఈ కష్టాలను యెదుర్కొనాలంటే, పార్టీయొక్క రాజకీయ పంథాకు తగిన, అవసరమైన కార్యకలాపానికి, మన నిర్మాణ కార్యక్రమానికి మధ్యగల వ్యత్యాసాన్ని తొలగించవలసివచ్చింది. జాతీయ ఆర్థిక విధానంలోని అన్నిరంగాలకు చెందిన నిర్మాణ నాయకులను రాజకీయ నాయకత్వ స్థాయికి వృద్ధి చేయవలసిన అవసరం వచ్చింది. పార్టీయొక్క రాజకీయ నినాదాలను, నిర్ణయాలను ఆచరణలో జయప్రదంగా నిర్వహించుటకు మననిర్మాణ కార్యక్రమం గ్యారంటీ చేయవలసివచ్చింది.

ఈ కష్టాలను దాటి విజయాన్ని పొందుటకై పోరాటాన్ని ఆర్గనైజ్ చేయవలసివచ్చింది. కార్మికులను, రైతులను, ఆ పోరాటంలోకి తీసుకురావలసివచ్చింది. పార్టీనే దృఢంగా పటిష్ఠకరించవలసివచ్చింది. నమ్మకస్థులు కానివారిని, అస్థిరమైనవారిని నిబ్బరము గోల్పోయినవారిని, పార్టీనుంచి, ఇతర ఆర్థిక సంస్థల నుంచి తొలగించవలసి వచ్చింది.

ఇవన్నీ చేయుటకు ఏమేమిపనులు అవసరమయినాయి ?

1. మన కార్యకలాపాల్లోని లోపాలనన్నిటిని బహిర్గతం చేయుట; ఆత్మ విమర్శనం.

2. కష్టాలనన్నిటిని ఎదుర్కొనుటకై, పార్టీని, ప్రభుత్వ యంత్రాన్ని, ఆర్థిక ట్రేడ్ యూనియన్ సంస్థలను, యువక కమ్యూనిస్టు సంఘాలను సహాయత్తంచేయుట.

3. పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క వినాదాలను నిర్ణయాలను ఆచరణలో అమలుచేయుటకు, అవసరమైనపోరాటాన్ని సాగించుటకు కార్మిక కర్షక ప్రజాసామాన్యమునంతనూ సమీకరించుట

4. శ్రమజీవులందరిలో ఉత్సాహం కలిగించి, అతివేగముగా పనిచేసే పద్ధతులను (షాక్ వర్కును) ప్రవేశపెట్టుట.

5. దేశమంతటా వ్యాపించియున్న యంత్రాగార ట్రాక్టర్ల కేంద్రాలను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను నడిపే పొలిటికల్ డిపార్టుమెంటును దేశవ్యాపితంగా ఆర్గనైజ్‌చేసి, పార్టీని, సోవియట్ నాయకత్వాన్ని గ్రామాలఅందుబాటులోకి తీసికొని వచ్చుట.

6. వ్యాపారనాయకత్వానికి, వ్యాపార సంస్థలకు దగ్గరసంబంధములను కల్పించుటకై పీపుల్స్ కమిషార్రైట్లను. హెడ్ ఆఫీసులను, వ్యాపార సంస్థలను వేరువేరుగా విభజించుట.

7. పనిలో వ్యక్తి బాధ్యతనుకల్గించి సమాన జీతాలపద్ధతిని నిర్మూలించుట.

8. ఫంక్షనల్ విధానాన్ని రద్దుగావించి, వ్యక్తి బాధ్యతను కల్పించి, సమిష్టి మేనేజ్‌మెంటు పద్ధతిని రద్దుగావించుట.

9. నిర్ణయాలను అమలుచేయించే విధానంలో ఎక్కువ కంట్రోల్‌ను ప్రవేశపెట్టుట; ఇందుకై కేంద్ర కంట్రోల్ కమిషన్, కార్మిక కర్షక తనిఖీ కమిటీలను పునర్నిర్మించుట.

10 పనిలో నైపుణ్యము కలవారినందరిని ఆఫీసులనుంచి పనిస్థానాలకు మార్చి, వారికి ఉత్పత్తివిధానంతో దగ్గర సంబంధములను కల్పించుట.

11. అభివృద్ధిచేయుటకు అసాధ్యమైన వ్యక్తులనందరిని బయటపెట్టి, రాజ్యాంగ నిర్వహణా శాఖలనుంచి వెళ్ళగొట్టుట.

12. పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నిర్ణయాలను వ్యతిరేకించే వారిని, కబుర్లుచెప్పే ఊసుబోక డబ్బాగాళ్ళను, వారి స్థానాలనుంచి తొలగించి, వారిస్థానే వారిపనిని వారు సరిగా నిర్వహిస్తూ తమంతట తామే ఆ పనిని నడుపుకుంటూ పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క శిక్షణను వృద్ధిపరిచేవారిని ప్రమోట్. చేయుట.

13 ప్రభుత్వమును, ఆర్థికసంస్థలను శుద్ధిచేసి వాటిలోని స్టాఫ్‌ను తగ్గించుట.

14. చివరిది— సమర్థులు కానటువంటి వారిని, అవినీతి పరులను పార్టీనుంచి వెళ్ళగొట్టుట.

కష్టాలనన్నిటినీ దాటుటకు, నిర్మాణ కార్యక్రమాన్ని రాజకీయ నాయకత్వ స్థాయికి తీసుకొనివచ్చుటకు, పార్టీ పంథాను కచ్చితంగా అమలు చేయుటకు ఈ పనులనన్నింటిని చేయవలసి వచ్చింది.

ఇప్పుడు మనం పరిశీలించే దశలో నిర్మాణ కార్యకలాపాన్నంతా పార్టీయొక్క కేంద్రకమిటీ ఇదేపద్ధతిలో నడిపించిందని మీ కందరికీ తెలుసును.

నిర్మాణ కార్యక్రమంలో ప్రధానవిషయం ఏమిటి? సరియైన వ్యక్తుల నియామకం, నిర్ణయాలను అమలుచేయునప్పుడు తనిఖీ చేయుట — ఇవే ప్రధానమని లెనిన్ చెప్పిన మహత్తరభావాన్ని కేంద్రకమిటీ మార్గదర్శిగా పెట్టుకుని పనిచేసింది.

సరియైన వ్యక్తుల నియామకాన్ని గురించి, వారిలో ఉంచిన నమ్మకానికి తగినట్లుగా పనిచేయక విఫలులైనవారిని డిస్మిస్ చేయుటనుగురించి రెండుమాటలు చెప్తాను.

అధికార దృక్పథంతో పనిచేస్తూ, మరమ్మతుకు అశక్యమైన పెద్దమనుష్యులను వారి స్థానాలనుంచి తొలగించే విషయంలో మనలో ఎవరికీ భేదాభిప్రాయాలు ఉండవు. పోతే, మన పనిని నెమ్మదిగా సాగిస్తూ, అడ్డగిస్తూ, అభివృద్ధి నిరోధకులుగా తయారయే రెండురకాలవారు ఉన్నారు. వారినిగురించి చెప్తాను:

మొదటి రకం :- గతంలో ఏవో కొంత సేవచేసి, ఈ నాడు 'అధికారులు'గా ప్రవర్తిస్తూ, పార్టీనిర్ణయాలు, ప్రభుత్వ శాసనాలు తమకొరకు గావింపబడలేదని, ఎవరో మూఢులకై చేయబడినవని భావించేవారు ఈ రకానికిచెందుతారు. సోవియట్ ప్రభుత్వం యొక్క పార్టీయొక్క నిర్ణయాలను పాటించి అమలుచేయుట తమ విధికాదని తలచే వీరు పార్టీ పునాదిని, ప్రభుత్వ శిక్షణను నాశనం చేస్తారు. పార్టీ నిర్ణయాలను, ప్రభుత్వ శాసనాలను ధిక్కరించుటలో వారికిగల ధైర్యం ఏమిటి? వారు గతంలో చేసిన సేవను చూసి, సోవియట్ ప్రభుత్వం వారిని ముట్టుకోదని; అహంభావముతోనూ అధికార మదంతోనూ కొట్టుకొంటున్న వీరిని తీసేసి ఇతరులను వారి స్థానే నియమించగల ధైర్యం సోవియట్ ప్రభుత్వానికి లేదని వారి ఊహ! ఇటువంటివారిని ఏం చెయ్యాలి? వేరే ఆలోచనగూడా లేకుండా వారు గతంలో ఎంతగొప్ప సేవచేసియున్నా సరే — వెంటనే వారి స్థానాలనుంచి తొలగించాలి ("వినండి", వినండి"). క్రిందిస్థానాలలో వారిని నియమించి పత్రికలలో ఈవిషయాన్ని ప్రకటించాలి. "(వినండి, వినండి"). అధికార గర్వంతో నిండియున్న వీరి గర్వాన్ని దెబ్బకొట్టి తిరిగి సరియైన స్థానాలలో పెట్టుటకై ఇది చేసితీరాలి,

సోవియట్ శిక్షణను, పార్టీ శిక్షణనుదిట్టపరచి మనకార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించుటకై ఈ చర్యను తప్పకతీసుకోవాలి. ("వినండి, వినండి").

ఇప్పుడు రెండోరకం వ్యక్తుల విషయం తీసుకుందాం. ఊసుబోక కబుర్లు చెప్పే "గాలితిత్తులు" ఈ రకానికి చెందిన వారు. "నమ్మకమైన గాలితిత్తులే" వీరు. సోవియట్ ప్రభుత్వమంటే భక్తి ఉంటుంది వీరికి. నమ్మకస్తులైనవారే. కాని కార్యనిర్వాహకవర్గంలో ఉండుటకు అసమర్థులు. ఆర్గనైజ్ చేసే శక్తి ఉండదు. క్రిందటి సంవత్సరం అటువంటి కామ్రేడ్ ఒకనితో నేను సంభాషించుటజరిగింది. అతడు చాలా గౌరవనీయమైన కామ్రేడే. కాని గొప్ప ఊసుబోక మాటలు చెప్పేశక్తి ఉంది అతనికి. ఎటువంటి సజీవ ఆశయాన్నైనా సరే, మాటల సముద్రంలో ముంచేస్తాడు. మా యిద్దరిమధ్య జరిగిన సంభాషణ ఇది:—

నేను : విత్తనాలు జల్లే పని ఎలా జరుగుతోంది?

అతడు : విత్తనాలు చల్లటమా, కామ్రేడ్ స్టాలిన్? అందరం సమాయత్తమైనాం. (నవ్వు)

నేను : సరే, తరువాత?

అతడు : విషయాన్ని సూటిగా చెప్పాం. (నవ్వు)

నేను : తరువాత?

అతడు : పరిస్థితి మారుతోంది, కామ్రేడ్ స్టాలిన్; త్వరలోనే పరిస్థితి మారుతుంది. (నవ్వు)

నేను : అయితే?

అతడు : కొంత అభివృద్ధిసూచనలు కన్పిస్తున్నాయి. (నవ్వు)

నేను : అదంవాసరే, విత్తనాలు చల్లటం అయిందా?

**అతడు :** కామ్రేడ్ స్టాలిన్! ఆ విషయంలో మాత్రం ఇంతవరకు మేం ముందంజవేయలేదనే చెప్పాలి. (అందరూనవ్వు)

"గాలితిత్తి" యొక్క లక్షణాలన్నీ ఇక్కడస్పష్టమౌతున్నాయి. అందరూ సమాయత్తమయ్యారు, విషయాన్ని సూటిగా అందరికీ తెలియబలిచారు. పరిస్థితిలో మార్పు గల్గించారు. కొంత అభివృద్ధి వచ్చింది — కాని పూర్వం యెక్కడవున్నదో పని యీ రోజుగూడా అక్కడే!

ఒక సంస్థనుగురించి ప్రశ్నిస్తూ ఈ మధ్య ఒక యుక్రేనియన్ కార్మికుణ్ణి, ఆ సంస్థకు ఒక పంథా అనేది ఏదైనా ఉన్నదా అని అడిగాను. మాకు సరియైన పంథాఅనేది ఒకటి వుందిగాని పని ఏమీ జరుగుతున్నట్లు కనపడదు" అన్నాడతను! (నవ్వు) తప్పకుండా ఆ సంస్థకుగూడా కొంత 'గాలితిత్తుల' కోటా ఉంటుందని నా నమ్మకం!

అటువంటి కబుర్ల రాయిళ్ళను వారి స్థానాలనుంచి తొలగించి నిర్మాణ కార్యకలాపానికి సంబంధించని ఇతరపనులను కల్పిస్తే నిర్ఘాంతపోయి "మమ్ములను ఎందుకు డిస్మిస్ చేసింది? మా బాధ్యతను నిర్వర్తించటానికి కావలసిన పనులన్నీ చేయలేదా మేము? షాక్ వర్కర్ల సమావేశాలను జరుపలేదా మేము? ఆ సమావేశాల్లో పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నినాదాలను గొంతెత్తి ప్రచారం చేయలేదా? కేంద్రకమిటీయొక్క పొలిట్ బ్యూరోను ఆనరరీ ప్రెసీడియమ్‌కు మొత్తంగా ఎన్నుకున్నామే? (నవ్వు) కామ్రేడ్ స్టాలిన్‌కు విప్లవ అభివందనాలను పంపించలేదా మేము? — ఇంకా ఏం చెయ్యాలి?" అంటారు. (పెద్దగా నవ్వు)

చెప్పతరంగాని ఈ గాలితిత్తులను ఏంచెయ్యాలి? వారినేగనుక నిర్మాణ కార్యక్రమంలో వుంచినట్లయితే, ఎంత గొప్ప ఆశయా

నైన్నా సరే కబుర్లతో తేల్చిపారేస్తారు. ఈ కబుర్లకు అంతు వుండదు. కనుక అటువంటివారిని నిర్మాణ స్థానాలనుంచి వెంటనే తొలగించాలనే విషయం తేటతెల్లమే. వారికి నిర్మాణ బాధ్యతలతో సంబంధంలేని యితర పనిని యివ్వవచ్చును. కాని నిర్మాణ రంగంలో మాత్రం కబుర్లరాయుళ్ళకు స్థానంలేదు.

("వినండి", "వినండి").

సోవియట్ సంస్థలలోనూ, యితర ఆర్థిక సంస్థలలోనూ, బాధ్యత వహించే వ్యక్తుల నియామకాన్ని గురించి, వారు నిర్ణయాలను అమలుచేసేటప్పుడు అవసరమైన చెకప్‌ను గురించి లోగడే చెప్పాను. ఈ కాంగ్రెసులో తన రిపోర్టు యిచ్చేటప్పుడు కామ్రేడ్ కగానోవిచ్ యీ విషయాలనుగురించి యింకా వివరంగా ప్రసంగిస్తాడు.

కాని భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి, అందులోగూడా నిర్ణయాలను పూర్తిగా అమలుచేసే విషయాన్నిగురించి రెండు మాటలు చెప్తాను. —

అధికార చైతన్యానికి వ్యతిరేకంగా చేయవలసిన తీవ్రపోరాటంలో, పనిని 'చెకప్' చేసే కార్యక్రమాన్ని సరిగా ఆర్గనైజ్ చేయుట ప్రధానమైన విషయం. నాయకత్వం వహించే కమిటీల నిర్ణయాలు అమలు చేయబడుతున్నవా లేక ఆఫీసు డ్రాయర్లలో నిర్ణయాలన్నీ భద్రపరచబడుతున్నవా? బోల్షివిక్ పద్ధతిప్రకారం మనస్ఫూర్తిగా పని జరుగుతున్నదా; లేదా? నిర్ణయాలన్నీ సక్రమ పంథాలో అమలుజరుగుతున్నవా? లేక పెడత్రోవలలో అమలు చేయబడుతున్నవా? ఇవన్నీ కనుగొనుటకై క్రమపద్ధతిలో వెంట వెంటనే చెకప్ జరుగుతూవుండాలి. పార్టీ నిర్మాణం అంతా సరిగా కదిలి పనిచేస్తూ ఉన్నదీ లేనిదీ తెలియజేస్తూ, అధికార

గర్వంతో పనిజేసేవారిని యెప్పటికప్పుడు బట్టబయలు చేయగల పరిశోధక జ్యోతిగా వినియోగపడుతుంది 'చెకప్' విధానం. నిర్ణయాలు సరిగా అమలు చేయబడుతున్నదీ లేనిదీ చూసే 'చెకప్' లేకపోవుటయే మన లోపాల్లోని, అపజయాల్లోని 100 కి 90 వంతులకు ముఖ్యకారణమని గట్టిగా నొక్కి చెప్పవచ్చు. ఎప్పటికప్పుడు లోపాలను సవరిస్తూవుండే 'చెకప్' వుంటే, యెన్నో లోపాలు, అపజయాలు రాకుండా చేసియుండేవారం.

నిర్మాణ కార్యక్రమరంగంలో మన కర్తవ్యాలు :—

1. పార్టీయొక్క రాజకీయ పంథాకు తగినట్లుగా నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించుట.

2. నిర్మాణ సంస్థలలోని నాయకుల స్థాయిని అభివృద్ధిచేసి రాజకీయ నాయకులుగా తయారుచేయుట.

3. పార్టీ నిర్ణయాలను, ముఖ్య రాజకీయ నినాదాలను నిర్మాణ సంస్థల నాయకులు సరిగా అమలుచేయునట్లు చూచుట.

# 'కేడర్ల' మీదనే అంతా ఆధారపడిఉంది

*అంతా 'టెక్నిక్ (పద్ధతి) మీదనే ఆధారపడి ఉంది' అనేది పాత నినాదం. సరియైన పద్ధతి లేని రోజుల్లో ఆ నినాదం అవసరమైంది. కాని ఆ దశనుదాటి ముందుకు వెళ్లాం. ఇప్పుడు ఆ నినాదం బదులు క్రొత్తనినాదం అవసరం. 'అంతా కేడర్ల మీదనే ఆధారపడి ఉంది'. ఇదీ మన ముఖ్య నినాదం ఇప్పుడు.

ఈ నూతననినాదంయొక్క పూర్తి అర్థాన్ని మనవాళ్ళందరూ గ్రహించారని చెప్పవచ్చునా? గ్రహించలేదంటాను. గ్రహించి ఉన్నట్లయితే, మన ఆచరణ కార్యక్రమంలో ప్రజలయందు, కేడర్లయందు, వర్కర్లయందు తరచుగా ప్రదర్శింపబడే దారుణ వైఖరికి అవకాశం ఉండదు. అంతా కేడర్లమీదనే ఆధారపడి ఉంది' అంటే అర్థం ఏమిటి? 'చిన్న'వారైనా 'పెద్ద'వారైనా,

---

* కేడర్లు:....ఈమాటకు అసలు అర్థం చట్రం లేక నిర్మాణాన్ని శద్రపరచే చట్రం అని చెప్పవచ్చును. పార్టీయొక్క వివిధ నిర్మాణ సంస్థలలో అనుక్షణం కృషిచేస్తూ పార్టీ అభివృద్ధికి తోడ్పడే కామ్రేడ్స్ అందరూ సజీవమైన చట్రంగా పనిచేస్తారు. అందువల్ల దీనిలోకి ఎల్లప్పుడూ క్రొత్తవారిని తీసుకుంటూ పునర్నిర్మిస్తూ బలపరచినప్పుడే సజీవంగా అభివృద్ధి పొందగలదని కామ్రేడ్స్ స్టాలిన్, డిమిట్రావ్‌ల అభిప్రాయం. ఇక్కడ సూచించిన మార్గాలను అనుసరించినప్పుడే ఈ అభివృద్ధి రాగలదు. నూతనంగా వచ్చి చేరేవారందరిని 'కేడర్లు' అంటున్నాం. వారిని అభివృద్ధిపరచి, బాధ్యతను నిర్వహించగల నాయకులుగా తయారుచేయుటయే కర్తవ్యం.

ఏ రంగంలో పనిచేస్తున్నప్పటికీ కాడ్రేస్ అందరియందు సుహృద్భావం కల్గి ఉండి, నిరంతరం వారికి శిక్షణ ఇచ్చుటకు కృషిచేస్తూ, వారికి అవసరమైన సహాయాన్ని ఇస్తూ, వారి ప్రథమవిజయాలకు ప్రోత్సాహమిస్తూ, ఇంకా ఎక్కువ బాధ్యతల నిర్వహించగల స్థానాలకు ప్రమోట్ చేయుట మొదలైనవి. అయినప్పటికి అనేక సమయాల్లో సరిగా ఈ వైఖరికి వ్యతిరేకముగా ప్రవర్తించే ఉదాహరణలు ఎన్నో కన్పిస్తాయి. అమానుషంగానూ, అధికార చైతన్యంతోనూ, దారుణంగా వర్కర్ల ముందు ప్రవర్తించటం జరుగుతోంది. ఎవరు ఏ స్థానానికి తగునో పరిశీలించకుండా, పాచికలను విసరినట్లుగా వర్కర్లను వివిధ స్థానాల్లోకి విసరివేయటమే తరచుగా జరుగుటయే ఈ దారుణస్థితికి కారణమవుతుంది. యంత్రసామగ్రుల విలువను గ్రహించి, మన ఫ్యాక్టరీలలోనూ, మిల్లులలోనూ పనిచేస్తున్న యంత్రసామగ్రుల జాబితాలను తగు శ్రద్ధతో రిపోర్టు చేస్తున్న మాట నిజమే. కాని ఆ శ్రద్ధతో, అంతే ఉత్సాహంతో, ఒక నిర్ణీతకాలంలో ఎంతమందికి శిక్షణ యివ్వబడిందీ, ఎంతమంది అభివృద్ధి చేసిందీ సరిగా తెలియజేసే రిపోర్టు ఒకటిగూడా లేదని నా అభిప్రాయం. ఎందువల్ల ఈ పరిస్థితి ఏర్పడింది? ఏమిటి దీనికి కారణం? ప్రజలయొక్క విలువను, వర్కర్ల విలువను కాడర్లయొక్క విలువను గ్రహించుట ఇంకా మనం నేర్చుకోక పోవుటయే దీనికి ప్రధాన కారణం.

ప్రవాస శిక్ష అనుభవిస్తూ నేను సైబీరియాలో ఉన్నరోజుల్లో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకంచేస్తాను. అది వసంతరుతువు. ఆ ఋతువులో వరదలు ఎక్కువగా వస్తాయి. మా దగ్గరనేవున్న నదిలోగూడా వరదలువచ్చి 'కలప' అంతా కొట్టుకుపోయింది. అలా కొట్టుకుపోయిన కలపను బయిటికి చేర్చుటకై 30 మంది వెళ్ళారు. సాయంత్రానికి తిరిగివచ్చారు. కాని వారిలో ఒక

కాశ్మేడ్ కన్పించలేదు. ఆ 30 వ మనిషి ఏడీ ? అని ప్రశ్నిస్తే ఏమోవాళ్ళకు పట్టినట్టుగా "వాడక్కడే వున్నాడు" అని సమాధానం ఇచ్చారు వాళ్ళందరూ. "అక్కడే ఉన్నాడంటే ?" అని తిరిగినేను అడిగితే, ఆదేధోరణితో "ఎందుకు అడగటం ? మునిగిపోయాడని తెలియటంలేదా ?" అన్నారు. వెంటనే వారిలో ఒకడు "గుర్రానికి నీళ్ళుపట్టటానికి వెళ్ళాలినేను" అంటూ గబాగబా అక్కడనుంచి వెళ్ళిపోబోతున్నాడు. మనుష్యులకంటే జంతువులే మీకు ప్రధానంగా ఉన్నట్లుందని నేను వారిని మందలిస్తే, దానికి జవాబుగా అందులో ఒకడు (మిగతా వారి అంగీకారంతో) "మనుష్యులంటే ఎందుకు అంత ఎక్కువ ఆదుర్దా ? ఎప్పుడైనాసరే మనుష్యులను తయారుచేయగలం. కాని గుర్రాన్నో ?— చేతనైతే ఒక గుర్రాన్ని చెయ్యి ?" అన్నాడు.

ఈ ఉదాహరణవల్ల ఏంతెలుస్తుంది ? మన నాయకులలో కొంతమంది ధోరణిని చూస్తే, వారు మనప్రజలయందు కాడర్ల యందు చూపించే వైఖరిని గమనిస్తే, ప్రజలయొక్క విలువను గ్రహించలేనివారి అశక్యతను పరిశీలిస్తే, ఇప్పుడు నేను చెప్పిన సైబీరియా గాథలో సోదర మానవులమధ్య ప్రదర్శింపబడిన దారుణ అమానుషత్వం వీరిలోగూడా కొంత మిగిలియున్నదా అనిపిస్తుంది.

అందువల్ల, కామ్రేడ్స్ చాలినంతమంది వర్కర్లు లేరనే లోపాన్ని యెదుర్కోవాలంటే మన దేశాన్ని అభివృద్ధి చేయగల కాడర్లను చాలినంతమందిని మనం తయారుచేయాలంటే మన ప్రజలయొక్క, కాడర్లయొక్క, మన ఆశయానికి చేయూత నిచ్చే ప్రతి వ్యక్తియొక్క విలువను గుర్తించటం మనం మొదట నేర్చుకోవలసిన విషయం.

ప్రపంచములోని విలువగల్గిన పెట్టుబడి అంతటిలోనూ, అన్నిటికంటె యెక్కువ విలువ గల్గినదీ - ప్రజలు, కాడర్లు అనే సత్యాన్ని యిప్పటికైనా మనం గ్రహించాలి. ప్రస్తుత పరిస్థితులలో విజయాలో, అపజయాలో - అన్నిటినీ నిర్ణయించగల్గినది కాడర్లే - అనే విషయాన్ని గుర్తించాలి. అంతా కాడర్లమీదనే ఆధారపడియున్నది. మన పరిశ్రమలలోనూ, వ్యవసాయ క్షేత్రాలలోనూ, రహదారీ సరఫరా శాఖలోనూ, సైన్యంలోనూ శక్తివంతమైన మంచి కాడర్లు అసంఖ్యాకంగా ఉంటే, మన దేశాన్ని అజేయంగా తయారుచేయగలం. అటువంటి కాడర్లు లేనియెడల రెండు కాళ్ళూ కుంటిపై కుర్రింగిపోవలసివస్తుంది.

నా ఉపన్యాసం ముగించబోయేముందు, ఎంర్రిసైన్య శిక్షణా కళాశాలలోనుంచి పట్టభద్రులైనవారి ఆరోగ్య విజయాలను కోరుతూ వారినందరినీ అభినందిస్తున్నాను. దేశరక్షణా నిర్వహణలో వారికి విజయం చేకూరగలదని భావిస్తున్నాను. సైనిక నిర్మాణ కార్యక్రమంలోనూ, దేశరక్షణ నడిపేవారి ప్రయత్నాలలోనూ వారికి విజయం కోరుతున్నాను.

కామేడ్స్, మీరందరూ ఉన్నత శిక్షణాకళాశాలలో శిక్షణ పొంది పట్టభద్రులైనారు. కాని యిది అంతా ప్రథమ శిక్షణ అనియే మీరు గుర్తించాలి. ఇక్కడ మీకందరికీ మొదటిసారి సానపెట్టారు. అంతే. స్కూలు అనేది శిక్షణనిచ్చుటకు ప్రథమ మెట్టుమాత్రమే.

స్కూలుకు బయట, కార్యరంగంలో ప్రత్యక్ష కష్టాలను యెదుర్కొని వాటిని దాటుటకు జరిపే పోరాటాల్లో మీకు నిజమైన శిక్షణవస్తుంది. కామేడ్స్, ప్రత్యక్ష కష్టాలు వచ్చినపుడు వెనుకకు జంకకుండా, భయపడకుండా వాటిని యెదుర్కొని గెలుపొందిన కాడర్లే యెందుకైనా పనికివచ్చేవని జ్ఞాపకముంచు

కోండి. కష్టాలను యెదుర్కొనుటకు జరిపే పోరాటంలోనే నిజమైన కాడర్లు తయారవుతాయి. అటువంటి సుశిక్షితమైన, గట్టిపడిన ఉక్కువంటికాడర్లు చాలినంతగా మన సైన్యములో ఉన్నప్పుడే మన యెర్రిసైన్యం అజేయమైన సైన్యంగా తయారుకాగలదు.

కామ్రేడ్స్,

మీ ఆరోగ్యాభివృద్ధినికోరుతూ ఇంతటితో ముగిస్తున్నాను.

# కేడర్ల సెలక్షన్, ప్రమోషన్, నియామకం.

రాజకీయపంథా దేనికి? ప్రకటనకొరకుగాదు. కార్యరంగంలో అమలుచేయుటకే సరియైన రాజకీయపంథా. కాని సరియైన రాజకీయపంథాను కార్యరంగంలో విజయవంతంగా అమలుజరపాలంటే, ఆరాజకీయపంథాను సరిగా అర్థంచేసుకొని, అది తమ పంథాయేఅని భావిస్తూ ఆచరణలో పెట్టగల్గి, ఆ పంథానుగురించి వచ్చే అనుమానాలను తీర్చి పంథాను సమర్థించి దానికొరకు పోరాడగల్గినశక్తిగల కాడర్లు అవసరం. అటువంటి కాడర్లులేనియడల, ఆ రాజకీయపంథా సరియైనది అయినప్పటికీ నామ మాత్రంగానే ఉండిపోతుంది.

ఇక్కడే బయలుదేరుతుంది అసలు విషయం. కాడర్లను సరిగా సెలెక్టుచేయుట, కాడర్లకు శిక్షణ ఇచ్చుట, కొత్తవారిని

ప్రొమోట్‌చేయుట, కాడర్లను సరిగా నియమించుట, చేస్తున్న పనినిబట్టి కాదర్లను పరీక్షచేయుట— యీ ప్రశ్నలు బయలు దేరుతాయి.

కాడర్లను సరిగా సెలక్ట్‌చేయుట అంటే ఏమిటి?

కాడర్లను సరిగా సెలెక్టుచేయుట అంటే, చుట్టూ బోలెడంత మంది అసిస్టెంట్లను, తమక్రింద పనిచేసేవారిని ప్రోగుజేసి, ఆఫీసు ఒకటిపెట్టుకొని, ఆర్డర్ తరువాత ఆర్డర్ ప్యాస్‌చేయటం కాదు (నవ్వు). తనక్రింద ఉండే వందలమందిని ఒక పనినుంచి ఇంకో పనిలోకి అసందర్భంగా మారుస్తూ "పునర్నిర్మాణాలు" సాగిస్తూ అధికార దుర్వినియోగం చేయుట కాదు. (నవ్వు)

కాడర్లను సరిగా సెలెక్టుచేయుట అంటే :—

1. పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క బంగారపునిధిగా కాదర్లను చూస్తూ, వారిని గౌరవిస్తూ భద్రపరచాలి.

2. కాడర్లనుగురించి తెలుసుకుంటూ, వారిలో ప్రతి ఒక వ్యక్తియొక్క సుగుణాలను, లోపాలనుగ్రహిస్తూ, ఏ స్థానంలో ఉంటే ఆ వ్యక్తియొక్క శక్తిసామర్థ్యములు అభివృద్ధి కాగలవో పరిశీలించాలి.

3. అభివృద్ధి కాగల ప్రతివర్కర్‌నూ, టైమ్ లేదని విసుగుపడకుండా, అభివృద్ధిచేస్తూ, కాడర్లను పెంపొందించాలి.

4. క్రొత్తవారిని, యువకకాడర్లను ధైర్యంగా సాహసించి, ప్రొమోట్ చేయాలి. కాని సంకోచిస్తూ, వారిని పాతస్థానాల్లోనే ఉంచి క్షీణింప చేయరాదు.

5. తనకు తగినటువంటి స్థానంలో నియమించబడినాడనే భావాన్ని ప్రతి వర్కర్‌లో కల్గునట్లు వర్కర్లను నియమించి నపుడు, ప్రతివర్కరూ తన సంపూర్ణ శక్తిసామర్థ్యములను విని యోగించి అందరి ఉమ్మడిఆశయంయొక్క అభివృద్ధికి తోడ్పడ

గల్గుతాడు. అంతేకాదు. రాజకీయ పంథాను అమలుచేయుటకు తగిన కాడర్ల విభజనగూడా జరుగుతుంది.

ఈ సందర్భంలో ప్రత్యేకంగా గుర్తించవలసినది-నూతనంగా వచ్చే యువక కేడర్లను సకాలంలో సాహసించి ప్రొమోట్ చేయుటయే. ఈ విషయంలో అందరికి స్పష్టమైన అభిప్రాయం లేదనుకుంటాను. వ్యక్తులను సెలెక్ట్ చేయునప్పుడు, ప్రధానంగా పాత కేడర్లమీదనే ఆధారపడాలని కొందరి అభిప్రాయం. అలా కాకుండా, నూతన కేడర్లమీద ప్రధానంగా ఆధారపడాలని మరి కొందరి అభిప్రాయం. ఈ రెండు అభిప్రాయాలూ సరియైనవి కావు.

పాత కాడర్లు పార్టీకి, ప్రభుత్వానికి గొప్ప అండ అనుటలో సందేహంలేదు. కొత్తవారికి లేని గొప్ప అనుభవజ్ఞానం, నాయకత్వ అనుభవం వారిలో ఉన్నమాటనిజమే. మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలలోనూ, విషయజ్ఞానంలోనూ, స్వయంశక్తితో నడుపగల శక్తిలోనూ, వారికి గొప్ప శిక్షణ అనుభవాలు ఉండేమాట నిజమే. కాని చాలినంతగా ఈ పాత కేడర్లు ఎప్పుడూ లేరని, కాల గతిలో వీరిసంఖ్య తగ్గిపోతున్నదనేది మొదటి విషయం. రెండవది - పాతవారిలో కొంతమందికి గడచిపోయిన భూత కాలమునందే దృష్టి ఎక్కువగా ఉండి, పాతదాన్నే పట్టుకొని వేళ్ళాడుతూ, పాత దారులలోనే చిక్కుకొనిపోయి. జీవిత కాలంలో వస్తున్న నూతన సృష్టిని గుర్తించలేకపోవుట జరుగుతుంది. నూతనగతిని చూడలేనటువంటి దృష్టి యేర్పడుతుంది. ఇది సామాన్యలోపంకాదు. చాలా అపాయకరమైన లోపంగా గూడ పరిణమిస్తుంది.

ఇక క్రొత్తగావచ్చిన యువక కేడర్ల విషయంలో పాతవారికున్నంత అనుభవం, శిక్షణ, విషయజ్ఞానం, స్వయంగా నడుప

గల శక్తిలేనిమాట వాస్తవమే. కాని యువక కాడర్లు అసంఖ్యాకులుగా ఉన్నారనేది మొదటి ముఖ్యవిషయం. రెండవది - వారంతా యువజను లగుటవల్ల ఇచ్చినపనిలోనుంచి వెళ్ళిపోయే అపాయం ఉండదు. మూడవది - బోల్షివిక్కుల లక్షణమైన ఉత్సాహం, నూతన జీవితమంటే అంతులేని ఉత్సాహం వారిలో నిండి ఉంటుంది. నాల్గవది - కొద్దికాలంలో పాతవారిని మించిపోయేటంత వడిగా విషయాలను గ్రహించేశక్తి, ముందుకు త్రోసుకొనిపోయే చొరవ వారిలో ఉంటుంది. కొద్దికాలంలో పాతవారికి సమానులుగా అభివృద్ధిచెంది, పాతవారిస్థానములను ఆక్రమించేస్థితికి వస్తారు అందువల్ల పాత కాడర్లమీద ఆధారపడాలా? లేక కొంత కాడర్లమీద ఆదారపడాలా? అనేది కాదు సమస్య. పార్టీకి, ప్రభుత్వానికి అగ్రగామియైన నాయకత్వమును తయారుచేయుటకై ఇద్దరిని జోడించి సమ్మేళనం గావించాలి. (హర్షధ్వనులు)

అందువల్ల నూతన యువక కాడర్లను పకాలంలో నాయక స్థానాలకు ప్రొమోట్ చేయుటకు సాహసించాలి.

ప్రస్తుత దశలో పార్టీ నాయకత్వాన్ని బలపరచే విషయంలో కాడర్లను ఎంపికచేసే సందర్భంలో పైనుంచి క్రిందవరకూ ఈ సూత్రాలను అనుసరించి పాత కాడర్లను కొత్తకాడర్లను సమ్మేళనంగావించి పనిచేయుట పార్టీసాధించిన మహత్తర విజయాలలో ఒకటి అని చెప్పవచ్చును.

పార్టీ కేంద్ర కమిటీయొక్క లెక్కల ప్రకారం, ప్రస్తుత దశలో నూతన యువక బోల్షివిక్కులను, పార్టీ సభ్యులుగాని, పార్టీకి దగ్గరగా ఉండేవారినిగాని, మొత్తం 5 లక్షలమందిని ఈ విధంగా బాధ్యతగల పార్టీ స్థానములకుగాని, ప్రభుత్వ స్థానము

లకుగాని ప్రమోట్ చేయుట జరిగింది. వీరిలో నూటికి 20 వంతులు స్త్రీలు.

ఇప్పుడు మన కర్తవ్యం యేమిటి?

పైనుంచి క్రిందికి కాడర్లను సెలక్టుచేసే పనినంతా కేంద్రీకరించి నిర్వహించుటకు ఒక ప్రత్యేక సంస్థను యేర్పాటుచేసి, దానిస్థాయిని నిజమైన బోల్షివిక్ స్థాయికి పెంపొందించుటయే మన కర్తవ్యం.

## ప్రాక్టికల్ కార్యక్రమం

('7 ప్రశ్నలకు సమాధానం' అను శీర్షికనుంచి కొన్నిభాగాలు యీ క్రింద యివ్వబడినాయి.

### పార్టీయొక్క రాజకీయ కార్యక్రమాన్ని యెలా బలపరచాలి?

పార్టీయొక్క రాజకీయ సమస్యలను మరచిపోయి, వాటి ప్రాధాన్యతగూడా సరిగా గుర్తించక పూర్తిగా ఆర్థిక వుద్యమాల్లోనూ, ఆర్థిక విజయాల్లోనూ నిమగ్నులైపోవుటవల్ల గుడ్డిదోవలలో పడిపోవుట యెలా జరిగేది ఈపాటికి అందరూ గ్రహించే వుంటారు. అందువల్ల మన వర్కర్ల దృష్టిని పార్టీ రాజకీయ సమస్యలవైపుకు మరల్చి, ఆర్థిక విజయంతోపాటు పార్టీ రాజకీయ కార్యక్రమాన్ని జోడించి విజయాలను పొందునట్లు చేయుట అవసరమైంది.

పార్టీ సంస్థలను ఆర్థిక సమస్యా వివరాలనుంచి తప్పించి పార్టీ రాజకీయ కార్యక్రమాన్ని బలపరచే విధానం మామూలుదైనందిన ఆచరణ కార్యక్రమంలో యెలా సాధ్యపడుతుంది? ఇప్పుడు జరిగిన చర్చలో నిరూపించబడినట్లు, ఆర్థిక కార్యక్రమంనుంచి పూర్తిగా సంబంధాలు తెంచుకొని బయటపడేదెలా? అనే తప్పుడు అర్థం కొందరు దీనికి కల్పిస్తున్నారు.

యేమైనప్పటికి కొంతమంది యీ విధంగా భావిస్తున్నారు — "మంచిది, యెలాగైతేనేం ఆర్థిక సమస్యలనుంచి యిహ బయట పడతాం. ముందు పార్టీ రాజకీయ కార్యక్రమంలో మునిగి పని చేయవచ్చును" నేను చెప్పేదాని అర్థం యిదికాదు. ఆర్థిక విజయాలవల్ల ఉన్మత్తులై రాజకీయాలనుంచి మన పార్టీ కామ్రేడ్సు దూరమవుతుంటే మనం యెంతో దెబ్బతిన్నాం. ఇప్పుడు రాజకీయ కార్యక్రమాన్ని బలపరచుటకు పనిచేస్తున్న కామ్రేడ్స్ ఆర్థిక సమస్యలతో సంబంధంలేకుండా దూరమైనా అదే ఫలితం కలుగుతుంది. అయితే యిటూ, లేకపోతే అటూ అనే పంథా వల్ల కలిగేనష్టం అపారమైనది. ఒక అతివాద దృకృథాన్నుంచి మరొక అతివాద దృక్పథానికి దూకుటకు వీలులేదు. రాజకీయాలను ఆర్థిక రంగాన్నుంచి వేరుచేయుటకూ వీలులేదు. రాజకీయాలకు మనం దూరమగుటకు యెలా వీలులేదో, అలాగే ఆర్థికసమస్యలనుంచి దూరమగుటకు వీలులేదు. పరిశీలనయొక్క సౌకర్యంకొరకు సాధారణంగా రాజకీయ సమస్యలనుంచి ఆర్థిక సమస్యలను వేరుచేసి పరిశీలించుట జరుగుతున్నది. కాని యీ విభజన కేవలం పరిశీలనా సౌకర్యంకొరకు మాత్రమే అను విషయం మరచిపోరాదు. వాస్తవిక జీవితంలో రాజకీయాలు, ఆర్థిక సమస్యలు వేరు వేరుగాలేవు. వేరుచేయుటకు వీలుకాదు. రెండూ కలసిపోయి వుంటాయి. కార్యరంగంలోగూడా ఆర్థిక రాజకీయాలు కలిసి పనిచేస్తూ వుంటాయి. అందువల్ల వాటిని ఒకదానినుంచి మరొకదానిని వేరుచేయుటకుగాని, ఆర్థిక రంగానికి నష్టం కలిగినాసరే రాజకీయాలను బలపరచాలని, లేక రాజకీయాలకు దెబ్బ తగులుతున్నా ఆర్థిక విజయాలకు పాటుబడుట గాని - అంధకార మార్గంలోకి తీసుకొనిపోక తప్పదు.

## వర్కర్సును సెలక్టుచేయటం యెలా?

వర్కర్సును సెలక్టుచేయటం, సెలక్టు చేసినతరువాత పనిలో సరిగా వారిని విభజించటం - అంటే అర్థంయేమిటి?

వర్కర్సును సెలక్టుచేయటం అంటే - (1) రాజకీయ దృక్ప థంనుంచి, ఆ స్థానానికి తగిన దృఢ రాజకీయస్థాయి ఉన్నదా? (2) ఆచరణ దృక్పథంనుంచి ఆ నిర్ణీత పనిని నిర్వహించగల శక్తి సామర్థ్యములు ఉన్నవా? ఈ రెండు విషయాలను చూసి కాడర్లను సెలక్ట్‌చెయ్యాలి.

దీని అర్థం - రాజకీయ స్థాయిని పాటించకుండా కేవలం కార్యసాధనశక్తిని గుణగణాలను లెక్కలోకి తీసుకొని వ్యాపార స్థుడి పంథాను అనుసరించుట కాదు.

దీని అర్థం - కార్యరంగంలో ఉన్న శక్తి సామర్థ్యములను పాటించకుండా కేవలం రాజకీయస్థాయియే ప్రధానంగా లెక్కిం చుటాకాదు.

ఈ బోల్షివిక్ సూత్రాన్ని ఆచరణలో మన కామ్రేడ్స్ వర్తింప చేస్తున్నారా? అని అడుగవచ్చును. అలా చేయటంలేదని చెప్పక తప్పదు. ఈ విషయాన్ని గురించి ఈ ప్లీనమ్ సమావేశంలో చెప్పడం జరిగింది. కాని విషయాన్నంతా చెప్పలేదు. యదా ర్థంగా జరుగుతున్నదేమిటంటే, ఈ అనుభవసూత్రాన్ని ఇష్టం వచ్చినట్లుగా దారుణంగా అమలుచేస్తున్నారు. అంతేకాదు. వర్కర్లు తరుచుగా, యదార్థ పరిస్థితులనుబట్టిగాక, మనస్సుకు తోచినట్లు వాస్తవిక పరిస్థితులకు సంబంధంలేని ఆలోచనల ఫలితంగా వర్కర్లను సెలెక్ట్‌చేయుట తరచుగా జరుగుతున్నది. ఎక్కువ తరచుగా తాము ఎరిగినవారిని, వ్యక్తిగత స్నేహితు లను, తమ ఊరివారిని, తమయందు వ్యక్తిగత భక్తిని చూపే

వారిని, తమను రక్షకులుగా భావించి పొగడేవారిని - రాజకీయ స్థాయి ఉన్నాసరే లేకపోయినాసరే, కార్యసాధనశక్తి ఉన్నాసరే లేకపోయినా సరే - వర్కర్లుగా సెలెక్ట్‌చేయుట జరుగుతోంది.

దాని ఫలితం ఏమిటి? బాధ్యతగల్గి నాయకత్వముపహించగల గ్రూపుకు బదులు ఒక కుటుంబ గ్రూపుగానో లేక ఒక స్నేహ బృందంగానో కమిటీలుఏర్పడి, ఒకరినొకరు తప్పులుపట్టకుండా, ఒకరినొకరు అభినందించుకుంటూ, ఒక రకమైన శాంతియుత జీవనాన్నిగడుపుతూ, బహిరంగముగా ప్రజలముందు లోపాలను బట్టబయలు చేసుకోకుండా ఉంటూ, తమ విజయాలనుగురించి తెలియజేసే తలనొప్పిరిపోర్టులను అప్పుడప్పుడూ కేంద్రమునకు పంపుట జరుగుతుంది.

అటువంటి 'బాంధవిక' సంబంధాలు ఏర్పడే వాతావరణంలో వారి పనిలోగల లోపాలను విమర్శించుకొనుటకుగాని, లేక తమ పనినిగురించి నాయకులు ఆత్మవిమర్శనం చేసుకొనుటకుగాని ఎంతమాత్రం అవకాశం ఉండదని సులభంగా తేటతెల్లమవు తుంది.

## కామ్రేడ్స్‌యొక్క పనిని 'చెకప్' చేయటం ఎలా ?

వర్కర్లమీద 'చెకప్' అంటేనూ, కర్తవ్యాలను నెరవేర్చే కార్యక్రమంమీద 'చెకప్'చేయుట అంటేనూ అర్థం ఏమిటి?

వారుచేసే వాగ్దానాలను, ప్రకటలను, బట్టిగాక, వారియొక్క కృషిఫలితాలనుబట్టి వర్కర్లను పరీక్షించుటయే వర్కర్లమీద చెకప్ అవుతుంది.

ఆఫీసులోనూ రిపోర్టులనుబట్టి మాత్రమేగాక నెరవేర్చిన పని ఫలితాలను బట్టి పనిచేసే కేంద్రములోనే ప్రధానంగా పరీక్షించు టయే సాధించిన కర్తవ్యాలమీద చెకప్ అవుతుంది.

అటువంటి జెనరల్ 'చెకప్' అవసరమా? నిస్సందేహంగా అవసరం. ఎందుకంటే (1) అటువంటిచెకప్‌వల్లనే వర్కర్‌ను నిజంగా తెలుసుకొనగల్గుతాం. ఇంకా అతని నిజగుణాలుగూడా వెల్లడి కాగలవు. (2) అటువంటి చెకప్‌ద్వారా మన కార్యనిర్వాహక నిర్మాణంలోని లోపాలోపాలను, మంచిచెడ్డలను తెలుసుకొన గల్గుతాం. (3) అటువంటి 'చెకప్'వల్లనే కర్తవ్యాల యొక్క లోపాలోపాలనుగూడా నిర్ణయించగల్గుతాం.

పనియొక్క ఫలితాలను నాయకులు పైనుంచి కామ్రేడ్స్‌ను పరీక్షచేయుటద్వారానే తెలుసుకొనగల్గుతారని కొంచరి కామ్రేడ్స్ అభిప్రాయం. ఇది సరియైనది కాదు. అంతమాత్రాన పైనుంచి తనిఖీచేయుట అనవసరమనికాదు. అదికూడా అవసరమే.

కాని పైనుంచి చేసే చెకప్‌ద్వారా జరగవలసిన 'చెకప్' అంతా జరుగదు. క్రిందినుంచి చేయవలసిన 'చెకప్'గూడా ఉన్నది. ప్రజలు, క్రిందికమిటీ కామ్రేడ్స్ నాయకులను పరీక్షించి వారి తప్పులనుచూపి వారిని సరియైన పద్ధతిలో పెట్టుటకై క్రింది నుంచిగూడా 'చెకప్' అవసరం. వ్యక్తులను పరీక్షించుటకు ఈ 'చెకప్' ఎంతో ఉపయోగపడుతుంది.

ఆక్టివ్ పార్టీవర్కర్ల సమావేశాల్లోనూ, కాన్ఫరెన్సులలోనూ నాయకుల రిపోర్టులనువిని, వారి లోపాలను విమర్శించి, పై కమిటీలకు ఎన్నుకునే విషయంలో కొంతమందిని ఎన్నుకొని ఇతరులను ఎన్నుకొనకుండా ఉండుటద్వారా పార్టీ సామాన్యసభ్యులందరూ పార్టీనాయకులను పరీక్షిస్తారు. మన పార్టీ నిబంధనల ప్రకారం నిజమైనటువంటి ప్రజాస్వామ్య కేంద్రీకరణ సూత్రం, అభ్యర్థులను నిలబెట్టి ఉపసంహరించుకునేహక్కులు, రహస్య వోటింగు, విమర్శనాస్వాతంత్ర్యం, ఆత్మవిమర్శనాస్వాతంత్ర్యం, ఇవన్నీ నిజంగా సజీవంగాఉండాలి, దానికొరకు జరిపేకృషి సంద

ర్యంలోనే పార్టీనాయకులను పార్టీ సామాన్య సభ్యులందరూ 'చెకప్'చేయుటగూడా జరుగుతుంది.

పార్టీకి చెందని ప్రజాసామాన్యం వారి ట్రేడ్‌యూనియన్, ఆర్థిక సంస్థలకు చెందిన నాయకులను, పార్టీకి చెందని ఆక్టివ్ వర్కర్ల సమావేశాల్లోనూ ఇంకా ఇతర అన్ని రకాల సమావేశాల్లోనూ వారి రిపోర్టులు విని లోపాలను విమర్శించే పద్ధతి ద్వారా సరిచేయగల్గుతారు.

## వారి తప్పుల నాధారంచేసుకునే కాడర్లకు శిక్షణ నిచ్చుట

కాడర్లతప్పులనాధారంగా జేసుకొని కాడర్లకు శిక్షణ ఇచ్చుట అంటే ఏమిటి?

పార్టీ కాడర్లకు విద్యగరపి శిక్షణ నిచ్చుటలోనూ, కార్మికులకు, ఇతరశ్రమజీవులకు విద్యాశిక్షణలు గరపుటలోనూ, సరియైన గ్యారంటీ పద్ధతి - పార్టీతప్పులను బుద్ధిపూర్వకంగా తెలియజెప్పి, ఏకారణాలవల్ల అటువంటి తప్పులు బయలుదేరినవో పరిశీలించి, ఆ తప్పులు తిరిగి రాకుండా సరియైనమార్గాలను నిర్ణయించుటయే అని లెనిన్ బోధించాడు.

లెనిన్ ఈ క్రిందివిధంగా చెప్పాడు :

"తనవర్గానికి శ్రమజీవులందరికి నిర్వర్తించవలసిన బాధ్యతలను పరీక్షించే విధానంలో తనయొక్క తప్పులయందు పార్టీ చూపించే వైఖరి ఒక ప్రధానవిషయం. ఆ వైఖరిలోనే పార్టీ స్వభావమంతా కనిపిస్తుంది. బహిరంగముగా తప్పునుఒప్పుకొని, దానికి కారణాలు తెలిపి, తప్పుమార్గానికి దారితీసిన పరిస్థితులను పరిశీలించి, ఆ తప్పును సవరించే మార్గాలను చర్చించే విధానం అమలులో ఉంటే నిజంగా పార్టీ తనయొక్క బాధ్యతలను నెరవేర్చుటకై పనిచేస్తున్నదని చెప్పవచ్చును. ఈ విధానంద్వారా,

కర్తవ్యాలను సరిగా నెరవేరుస్తూ తనవర్గానికి, ప్రజాసామాన్యానికి సరిగా శిక్షణ గరపి పనిచేయగలదు."

అనగా తప్పులను దాటవేయకుండా ఉండుట: తప్పులను మరుగుపరచకుండుట, బహిరంగంగా, న్యాయంగా తప్పులను ఒప్పుకొని, బహిరంగముగానూ, బుద్ధిపూర్వకముగానూ తప్పులను సవరించుకొనుట - ఇవి బోల్షివిక్కుల లక్షణాలు.

కాని యీ పనిని కామ్రేడ్స్ అందరూ తృప్తికరంగా చేస్తున్నారా ? లేదు. కాని బోల్షివిక్కులు నిజమైన బోల్షివిక్కులుగా వుండాలంటే, తప్పులను బహిరంగముగా ఒప్పుకునే ధైర్యం, వాటికి కారణాలు, చెప్పి, సరియైన మార్గాన్ని సూచించి, పార్టీ సభ్యులకు సరియైన శిక్షణనిచ్చే ధైర్యం వుండాలి. ఈ ఆత్మ విమర్శన పద్ధతియే బోల్షివిక్కుల సరియైన శిక్షణాపద్ధతి. పార్టీ సభ్యులుగాని, పార్టీ నాయకులుగాని శిక్షణపొందే మార్గం యిదే.

మన తప్పులను బహిరంగపరచుటవల్ల మన శత్రువులు వాటిని మన బలహీనతగా యెంచి వారి ప్రయోజనములకై వినియోగించగల్గుతారనే భావంతో కొంతమంది కామ్రేడ్స్ మన తప్పులను బహిరంగపరచగూడ దంటారు.

కామ్రేడ్స్, యీ వాదన అర్థంలేనిది. ఇలా వాదించటం శుద్ధ తప్పు. ఆత్మ విమర్శనద్వారా, తప్పులను బహిరంగపరచుటద్వారా కార్మికులలో, రైతులలో, శ్రమచేయు విద్యాధికులలో నమ్మకం హెచ్చి మన పార్టీ మరింత బలపడగలదు మన ప్రభుత్వముయొక్క అధికారం బలపడగలదు. నిజానికి ప్రధానమైన విషయం ఇదే కార్మికులు, రైతులు, శ్రమచేసే విద్యాధికులు మనపట్ల వున్నంతకాలం యితర విషయాలన్నీ అవే పరిష్కారం కాగలవు.

తప్పులను బహిరంగపరచుటవల్ల కాడర్లకు శిక్షణ హెచ్చి బలపడేబదులు వారిని బలహీనపరచి వారిలో అయిష్టత బయలు దేరవచ్చును గనుక, మన కాడర్ల యొక్క పరువు ప్రతిష్టలను కాపాడుటకొరకై తప్పులను బహిరంగపరచగూడదని కొందరి కామేడ్స్ అభిప్రాయం. అందువల్ల తప్పులను అంతగా పట్టుకోకుండా దాటవేస్తూ విమర్శగూడా తీవ్రంగా సాగించగూడ దని వారి వుద్దేశ్యం. ఇదిగూడా తప్పు పంథాయేనని వేరుగా చెప్పనక్కరలేదు. తప్పులను మరుగుబుచ్చి కామేడ్సును 'కాపాడే' ప్రయత్నంవల్ల తప్పనిసరిగా కాడర్లన్నీ నాశనమగు టకు దారితీయుటయే జరుగుతుంది.

## ప్రజలకు బోధించుట — వారినుంచి నేర్చుకొనుట.

ప్రజలకు బోధించుటయేగాక వారినుంచి నేర్చుకొనమనిగూడా లెనిన్ చెప్పాడు.

ఏమిటి దీని అర్థం ?

దీని అర్థం ఏమిటంటే — (1) మనకు అహంభావం యెంత మాత్రం పనికిరాదని, కేంద్రకమిటీ సభ్యులైనప్పటికి, పీపుల్స్ కిమీసార్లయినప్పటికి సరియైన నాయకత్వమునకు అవసరమైన విజ్ఞానమంతా ఉన్నదనే భావం తప్పు. ఒక అధికార స్థానంలో ఉన్నంతమాత్రాన విజ్ఞాన అనుభవాలను ఆస్థానం కల్గచేయలేదు.

(2) సరియైన నాయకత్వం వహించుటకు కేవలం నాయ కుల అనుభవం చాలదు. అందువల్ల నాయకుల అనుభవంతో పాటు ప్రజా సామాన్య అనుభవాలను పార్టీ సభ్యుల అనుభవా లను కార్మికవర్గ అనుభవాలను కలిపి జోడించి పనిచేయుట అవసరం.

(3) ఎట్టి పరిస్థితులలోనైనా ఒక క్షణమాత్రంగూడా ప్రజా సంబంధాన్ని బలహీనపరచుకొనుటగాని, తెంచుకొనుటగాని చేయగూడదు.

(4) ప్రజలయొక్క అభిప్రాయాన్ని, 'సామాన్య' పార్టీ సభ్యుల అభిప్రాయాన్ని, 'చిన్న' వారి అభిప్రాయాలను జాగ్రత్తగా గుర్తించవలసి యున్నది.

## సరిగా నడుపుట అంటే అర్థం యేమిటి?

ఆఫీసులోకూర్చుని సూచనల జాబితాలను తయారుచేయుట సరిగా నడుపుట కానేరదు.

సరిగా నడుపుట అంటే?

(1) సమస్యను యెదుర్కొనుటకై సరియైన మార్గాన్ని నిర్ణయించుట. మన నాయకత్వ ఫలితాలను మోసే ప్రజలయొక్క అనుభవాన్ని లెక్కలోకి తీసుకొనకుండా సరియైన మార్గన్ని నిర్ణయించలేము.

(2) సరియైన మార్గాన్ని నిర్ణయించిన తరువాత, దాన్ని అమలుపరిచే కార్యక్రమాన్ని ఆర్గనైజ్‌చేయుట. కార్యక్రమాన్ని ప్రజల ప్రత్యక్ష సహకారంలేకుండా యెప్పుడూ సాగించలేమనే విషయం స్పష్టమే.

(3) కార్యక్రమాన్ని అమలు చేయునప్పుడు దానిమీద 'చెకప్'ను ఆర్గనైజ్‌చేయుట - దీనికిగూడా ప్రజల ప్రత్యక్ష సహాయము అవసరం.

నాయకులం మనం ప్రజలనూ, పరిస్థితులనూ ఎప్పుడూ ఒకే దృక్పథాన్నుంచి చూస్తాం. అనగా ఎప్పుడూ పైనుంచేచూడటం జరుగుతుంది. అందువల్ల మన దృష్టి మొత్తంమీద కొన్ని హద్దులు కలిగివుంటుంది. కాని ప్రజలు పరిస్థితులను మరొక

దృష్టితో చూస్తారు, క్రిందినుంచి చూస్తూవుంటారు. అందు వల్ల ఒకవిధంగా వారి దృష్టికికూడా కొంతవరకు హద్దులుంటాయి. ఏ సమస్యా పరిష్కారానికైనా యీ రెండు దృక్పథాలు అవసరం. రెండురకాల అనుభవాలు ఐక్యమవాలి. అప్పుడే నాయకత్వం యిచ్చే పంథా సరియైన దవుతుంది.

ఇదే దీని అర్థం - ప్రజలకు బోధించుటయేకాదు, వారిదగ్గర నుంచి నేర్చుకోవాలి గూడా..........

అందువల్ల సమస్యలను యెదుర్కొని నడిపేటప్పుడు, కేవలము మన అనుభవంమాత్రమే చాలదని స్పష్టపడుతోంది. సరిగా నడుపుటకై పార్టీ సభ్యుల అనుభవాన్ని, కార్మికుల అనుభవాన్ని, ఇతర శ్రమజీవుల అనుభవాన్ని, ఇతర 'క్రింది'వ్యక్తుల అనుభవాన్ని నాయకుల అనుభవంతో జోడించుట అవసరం.

ఇది ఎప్పుడు సాధ్యపడుతుంది ?

నాయకులు ప్రజలతో సంబంధంకలిగి వున్నప్పుడు, పార్టీ సభ్యులతోనూ, కార్మికవర్గంతోనూ, రైతాంగముతోను, పనిచేసే విద్యాధికులతోను నిత్య సంబంధాన్నికల్గి ఉన్నప్పుడే ఇది సాధ్య పడుతుంది.

ప్రజలతో సంబంధం, ఆ సంబంధాన్ని బలపరుచుకొనుట, ప్రజాభిప్రాయాలను వినుటకు తయారుగా ఉండుట - దీనిలోనే బోల్షివిక్ నాయకత్వంయొక్క అభేద్యశక్తి యిమిడివున్నది. ప్రజా సామాన్యముతో సంబంధము లున్నంతవరకూ బోల్షివిక్కులు అజేయులని చెప్పవచ్చును. అదేరీతిగా ప్రజలతో గల సంబంధం బలహీనమగుటగాని, లేక పూర్తిగా సంబంధములు లేకుండాపోవుటగాని జరిగినప్పుడు అధికారతుప్పుతో వారు రోజురోజుకు జీర్ణించి, బలహీనమై శూన్యస్థితికి క్షీణిస్తారని వేరుగా చెప్పనక్కరలేదు.

ప్రాచీన గ్రీక్ పౌరాణిక చరిత్రలో ఒక కథ వుంది. ఆ పురాణచరిత్రప్రకారం పోసి డాన్ సముద్రదేవుడు. భూదేవి 'గే'. వీరిద్దరి పుత్రుడు 'ఆంటియస్'. తన్ను మోసి, కని, పెంచిన తల్లిమీద 'ఆంటియస్'కు యెక్కువ ప్రేమ. 'ఆంటియస్'ను ఓడించగల వీరుడెవడూలేడు. అజేయ వీరుడని ఆంటియస్‌ను గురించి అందరూ తలచేవారు. ఎక్కడినుంచి వచ్చింది యింత బలం అతనికి ? ఎవరితో పోరాటంచేస్తున్నా, అతడు భూమిని తాకినప్పుడల్లా తన తల్లియైన భూదేవి అతనికి నూతన బలాన్ని ప్రసాదిస్తూ వుండేది. ఇట్టి పరిస్థితిలోకూడ ఆంటియస్‌కు ఒక బలహీనత వున్నదని గుర్తించాలి. భూమినుంచి అతన్ని వేరు చేయగల్గితే సులభంగా ఆంటియస్ ఓడిపోతాడు. చివరికి యీ బలహీనతను ఉపయోగించుకొనే శత్రువు ఒకడు బయలుదేరాడు. అతడే హెర్క్యులిస్. హెర్క్యులిస్ ఆంటియస్‌ను యెలా ఓడించాడు ? భూమినుంచి వేరుచేసి, గాలిలోకి యెత్తి, భూమిని తాకకుండాచేసి ఆంటియస్ పీక నొక్కేశాడు.

బోల్షివిక్కుల విషయం గ్రీక్ యోధుడైన ఆంటియస్‌ను జ్ఞాపకం చేస్తుంది.

తమను మోసి, పెంచి, శిక్షణనిచ్చిన తల్లియైన ప్రజలతో సంబంధం ఉన్నంతవరకూ బోల్షివిక్కులు 'ఆంటియస్'వలె అజేయులే. ప్రజల సంబంధం వున్నంతకాలం వారిని ఓడించుటకు యెవరిశక్యం కాదు.

బోల్షివిక్కు నాయకత్వంలోని రహస్యం యిదే.

# 1 వ అనుబంధము

(పార్టీ శిక్షణమీద, పార్టీలోని ప్రజాస్వామ్యంమీద కామ్రేడ్ ఎల్. ఎమ్. కగానోవిచ్ (1) రిపోర్టులోని భాగాలు.)

భరించలేనంత ఆఫీసు పనితోనూ, తీర్మానాలు వ్రాయుట తోనూ తీరికలేని మనవాళ్ళు 'చిన్న విషయాలను' లెక్కచేయక పోవటం, మనుష్యులనే గుర్తించకపోవటం, జరుగుతోంది. క్రొత్త ఫోర్‌మన్లు, క్రొత్త యింజనీయర్లు, క్రొత్త టెక్నీషియన్లు, నూతన కార్మిక వీరులును, పైకివస్తున్న యువక కమ్యూనిస్టులు మనవారి కళ్ళకు కనపడరు.

మనకు చాలినంతమంది మనుష్యులులేరని కొందరి అభిప్రాయం. కాని ఇది నిజంకాదు. మనకు మనుష్య లున్నారు. శక్తివంతులైన మనుష్యులు వున్నారు. కాని వారిని ప్రొమోట్ చేసి సరియైన స్థానాల్లో వుంచాలి. వారిని మనం సరిగా నడపాలి. ఒక పనిలో ప్రవేశపెట్టిన కామ్రేడ్‌కు శిక్షణయిస్తూ, పనిలో అతన్ని వృద్ధిచేయాలి. ఎప్పటికప్పుడు అతన్ని తప్పు పట్టకుండా జాగ్రత్తగా చూస్తూవుండాలి. అప్పుడప్పుడు తప్పును వదిలిస్తూవుండాలి.

పార్టీ సభ్యులను సరిగా చేర్చుకొనుటతో పని పూర్తికాలేదు. చేయవలసిన పనిలో అది సగభాగం మాత్రమే. క్రొత్తగా చేర్చుకొన్న పార్టీ సభ్యుడికి సరియైన సిద్ధాంత విజ్ఞానాన్నియిస్తూ అతడు రోజురోజుకు అభివృద్ధిపొంది, పెరుగనట్లుచేస్తూ, అతడి దైనందిన కార్యక్రమంలో సరిగా నడుపుతున్నట్లు అతనికి నమ్మకము కలిగిస్తూ, పార్టీ పనిలో నిమగ్నుడై రాజకీయంగా దిట్ట

---

1. 17 వ సో. యూ. క. పార్టీ కాంగ్రెసులో నిర్మాణ సమస్యల మీద కగానోవిచ్ యిచ్చిన రిపోర్టులో భాగాలు.

పడేటట్లు మనం చేయవలసి యున్నది. మార్క్సిస్టు, లెనినిస్టు శిక్షణ అంటే క్లాస్‌రూములో శిక్షణ యివ్వటంకాదు; బోల్షివిక్ యొక్క సిద్ధాంత పరిజ్ఞానమును కలుగజేయుటయే నిజమైన శిక్షణ అవుతుంది. పార్టీ స్కూలులో పార్టీ సభ్యునికి శిక్షణ యివ్వవలసిందే. కాని నిత్య రాజకీయ - ఆచరణ కార్యక్రమంలో శిక్షణ యిచ్చుటయే ప్రధానమైనది. అనగా పార్టీసభ్యుల యొక్క మార్క్సిస్టు - లెనినిస్టు శిక్షణను ఉచ్ఛస్థాయికి పెంపొందించి పార్టీ నిర్మాణ కార్యక్రమాన్ని అభివృద్ధిచేయాలి.

సిద్ధాంత సమస్యలను యెల్లప్పుడూ దైనందిన ఆచరణతో జోడించేవాడు లెనిన్. ఎంత క్లిష్టమైన సిద్ధాంత సమస్యలనైనా దైనందిన పోరాటంతో జోడించే ఉదాహరణలను స్టాలిన్ యిస్తాడు. అయినప్పటికీ మన కమ్యూనిస్టు ప్రొఫెసర్లు యింకా సిద్ధాంత ఆచరణలను వేరువేరుగా వుంచి, రెంటిని జోడించలేక పోతున్నారు. సిద్ధాంత ఆచరణలను సమ్మేళనము గావించేబదులు యింకా వారు 'తాడుయొక్క స్వభావాన్నిగురించి' బ్రహ్మాండమైన సిద్ధాంతరచనలను (మార్క్స్, ఎంగెల్స్, ఆ విషయాన్ని గురించి వారి రచనలలో యేమీ చెప్పలేదని!) తయారుచేస్తూ, మార్క్సిస్టుకోశమునకు ఏవో అద్భుతమైన నూతన విషయాన్ని జేరుస్తున్నామనుకుంటున్నారు।

ఇంకా మన సోవియట్ పార్టీ స్కూళ్లు స్కూలుపద్ధతిలోనే నడుపబడేవి చాలా వున్నాయి. బోల్షివిక్ స్కూలుపిల్లవాడు కాదు. అతని శిక్షణ రాజకీయ శిక్షణ అగుటవల్ల, దైనందిన రాజకీయ పోరాటాలను, దైనందిన కార్యక్రమంలో వచ్చేపోరాటాలను జోడించి అతనికి శిక్షణ యివ్వాలి. పార్టీ స్కూలులోనూ, మరియు పార్టీసమావేశాల్లోనూ అతనికి సిద్ధాంత విజ్ఞాన శిక్షణ యివ్వాలి. అందుకనే మన నూతన నిబంధనలలో కేవ

లము ‘శిక్షణ’ను గురించేగాక, కమ్యూనిష్టుకు యివ్వవలసిన ‘సిద్ధాంతరీత్యా సమాయత్తపరచుట’నుగురించి చెప్పబడుతున్నది. మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలలో ప్రతి పార్టీ సభ్యునికి సిద్ధాంత విజ్ఞానం కలుగజెయ్యాలి.

పార్టీసభ్యుల విషయంలోనే ఇన్ని నిబంధనలు పెట్టినపుడు ఇక పార్టీ నాయకులవిషయంలో ఇంకా ఎన్ని ఎక్కువ నిబంధనలు అవుసరమౌతాయి? ఉత్తమ ప్రచారకులకు-ఉత్తమ ఆర్గనైజర్లకు మధ్య భేదములు ఉండరాదు. ప్రత్యేక నైపుణ్యత సంపాదించుట అవసరమే. అది చాలామంచిదే. కాని దానిని అతిగా మనంచేయ రాదు. సాధారణంగా ఆర్గనైజర్లు ప్రచార ఆందోళనలు సాగించక పోవుటకు కారణం ఏమిటి? కాల వ్యవధి లేకపోవుటయే కాదు కారణం. యదార్థంచెప్పాలంటే ఆర్గనైజర్లకు ఆపని చేతగాక పోవుటమే ప్రధానకారణం. ఫాక్టరీని నడిపే డైరెక్టరు ఫాక్టరీని గురించి అన్ని విషయాలను పూర్తిగా తెలుసుకొనుట అవసర మని తెలుసుకున్నాం. ఫాక్టరీ విషయంలో డైరెక్టర్ బాధ్యత ఇది ఐతే, ఇక పార్టీ కమిటీ సెక్రటరీసంగతి వేరేచెప్పాలా? ప్రతి జిల్లాకమిటీసెక్రటరీ, ప్రతి పార్టీ ఆర్గనైజరూ మార్క్సిస్టు-లెనినిస్టుశ్రేణిలతబద్ధను ఉపయోగించగల శక్తిని కల్గి ఉండాలి. ప్రతి పార్టీ నాయకుడు, ఉత్తమ ఆర్గనైజరూ కార్య నిర్వాకుడూ అయి ఉండుటయే గాక ఉత్తమ ప్రచారకుడుగానూ, పార్టీ సభ్యుల బోధకుడుగానూ అయి ఉండాలి.

మన పార్టీ సమావేశాలస్థాయి హెచ్చిందని మనకుతెలుసును. పార్టీ స్కూళ్ళలోనే గాక, వాటిలోకంటే ఎక్కువగా బోల్షివిజమ్‌ను ఈపార్టీసమావేశాలలో పార్టీసభ్యులు నేర్చుకోవాలి. ఇది ప్రతివారికి తెలిసిన విషయమే.

మన పార్టీ కార్యక్రమానికి, పార్టీసభ్యుల శిక్షణకు కీలకమైన సూత్రాలు పార్టీలోని ప్రజాస్వామ్యం, ఆత్మ విమర్శనా సూత్రాలు, అయి ఉన్నాయి. పార్టీలోని ప్రజాస్వామ్యం నూతన స్థాయికి వచ్చింది. పార్టీలోని ప్రజాస్వామ్యం అంటే ఇప్పుడు నూతన అర్థం ఏర్పడింది. కమ్యూనిస్టుల సమావేశాలకు ఈనాడు హాజరైనయెడల, ఈ సమావేశాలను 2 సంవత్సరాల పూర్వ సమావేశాలతో పోల్చడానికి వీలులేదని తెలుస్తుంది.

ఆర్గనైజర్లయొక్క, ప్రచారకులయొక్క పనులను జోడించ గలిగినట్లయితే మనం ఇంకా యెక్కువ విజయాన్ని సాధించి ఉండేవారమని నిస్సందేహంగా చెప్పవచ్చును. అలా చేసి యున్నట్లయితే కమ్యూనిస్టులయొక్క సిద్ధాంత విజ్ఞానం నూతన స్థాయికి వచ్చి ఉండేది. సరియైన సన్నాహం చేయకుండా మామూలు ప్రాత ధోరణిలోనే కొన్ని పార్టీ సమావేశాలు అక్కడక్కడ జరుగుతూ ఉంటాయి. ప్రజలనందరినీ సమావేశ పరచి, "కామ్రేడ్స్, మన కర్తవ్యాలు ఇవి. మనం ఈ కర్తవ్యాలను తప్పక నియమితకాలంలో నెరవేర్చి తీరాలి." అని చెప్తాడు సమావేశకర్త. లేకపోతే ఏదో వుద్యమాన్నిగురించియో లేక ఒక వార్షిక ఉత్సవాన్ని గురించియో చర్చ జరుగుతుంది. అటువంటి సమావేశాల్లో కేవలం పని విభజనమాత్రం జరుగుతుంది. పార్టీసభ్యుల శిక్షణకు అవకాశంలేదు అయినప్పటికి ప్రతి పార్టీ సమావేశం కమ్యూనిస్టుల సిద్ధాంత విజ్ఞానస్థాయిని వృద్ధిచేయుటకు ఉపయోగపడి తీరుతుంది. పార్టీలోని సమస్యలమీద రాజకీయ సమస్యలమీద సోషలిస్టునిర్మాణానికి సంబంధించినవిషయాలమీద జరిగే చర్యలు పార్టీ సభ్యుల తెలివితేటలను వృద్ధిచేసి బోల్షివిక్కులు ప్రజా ఆర్గనైజర్లుగా నిర్వహించవలసిన అగ్రగామి

పాత్రయొక్క ప్రాముఖ్యతను అర్థం చేసుకునేస్థాయిని ఎక్కువ చేస్తుంది.

పార్టీపంథాకు సంబంధించిన విషయాలమీద స్వేచ్ఛగా అవసరమైనంతవరకూ జరిగే చర్చలు పార్టీసభ్యుని వృద్ధిచేసి, పార్టీలోని ప్రజాస్వామ్య సూత్రాలలో శిక్షణపొంది గట్టిపడతాడు. అంతేగాక ఈ చర్చలను అలుసుగా తీసుకొని పార్టీ పంథాను భగ్నపరచాలని, పార్టీ నాయకత్వాన్ని కూలద్రోయాలని, పార్టీలో ఉక్కు సభ్యులనందరిని చెదరగొట్టాలని ప్రయత్నం చేసేవారికి వ్యతిరేకంగా జరిగే తీవ్రపోరాటంలోగూడా పార్టీసభ్యులు శిక్షణ పొంది గట్టిపడతారు. పార్టీ పాలసీనుంచి దూరమవుతూ లెనినిస్టు పంథానుంచి పెడత్రోవల పోయేవారికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాలలోనూ, పార్టీసభ్యుల ఐక్యతను కాపాడుటకు జరిగిన పోరాటాలలోనూ పార్టీసభ్యులు బాగా గట్టిపడ్డారని అనుభవంవల్ల చెప్పవచ్చును.

అందువల్లనే అవకాశవాదం కొద్దిపాటిదైనా బయలుదేరిన వెంటనే దానిని రూపుమాపుటకై జరిపే పోరాటంతో పార్టీ సభ్యులను యింకా వృద్ధిచేసి గట్టిపరచవలసి యున్నది.

పార్టీలోని కార్యకలాపాన్ని ఆర్గనైజ్ చేయుటమీద, పార్టీ సభ్యునికిచ్చే వ్యక్తిగత శ్రద్ధమీద, అతన్నినడిపే పద్ధతిమీద.... పార్టీ సభ్యుని అభివృద్ధి ఆధారపడియున్నది

# 2 వ అనుబంధము

## * కేడర్లను గురించి - డిమిట్రొవ్

కామ్రేడ్స్, అమలుచేయుటకు మనుష్యులు లేనప్పుడు ఎంత మంచిమంచి తీర్మానాలైనా కాగితంమీదనే ఉండిపోతాయి. మన లను యెదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో కాడర్ల సమస్య ఒకటి అయినప్పటికి, ఆ సమస్యనుగురించి యీ సమావేశంలో సరియైన శ్రద్ధ జూపించకపోవుట దురదృష్టవశమైనది. కమ్యూ నిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గం రిపోర్టు 7 రోజులు చర్చించబడింది. వివిధ దేశములకుచెందిన అనేకమంది ప్రతి నిధులు మాట్లాడారు. వారిలో బహు కొద్దిమంది మాత్రమే ఈ ప్రధాన సమస్యనుగురించి, అదిగూడా పైపైనమాత్రమే మాట్లా డారు. ఆచరణ కార్యక్రమంలో అంతా కేడర్లమీదనే ఆధారపడి యున్నదనే విషయం మన పార్టీలు పూర్తిగా గ్రహించలేదనే చెప్పాలి. 'తోటమాలి తనకు ప్రియమైన ఫలవృక్షాన్ని' పెంచి నట్లుగా కాడర్లను వృద్ధిచేయాలని కామ్రేడ్ స్టాలిన్ చెప్పిన దాన్ని అమలు చేయలేకపోతున్నారు. 'ప్రజలయొక్క, కాడర్ల యొక్క, మన ఉమ్మడి ఆశయానికి తోడ్పడే ప్రతి వర్కరు యొక్క విలువను' గుర్తించ లేకపోతున్నారు.

మన పోరాటంతో ఎంత విలువగల కాడర్లను నష్టపోతున్నా మనే విషయాన్ని జ్ఞాపకం పెట్టుకుంటే, ప్రస్తుతం కాడర్ల సమ స్యయందు మనం చూపిస్తున్న అజాగ్రత్త వైఖరి ఎంతమాత్రం క్షంతవ్యంకాదు. మనది పండితుల సమాజంలాంటిది కాదు.

---

* 1935 కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 7 వ కాంగ్రెసులో 'ఐక్య సంఘటన' మీద డిమిట్రొవ్ యిచ్చిన ఉపన్యాసంలోనుంచి భాగాలు.

పోరాటరంగంలో ప్రతిక్షణం పోరాడుతున్న తీవ్రమైన ప్రజా ఉద్యమం మనది. మనందరిలోనూ యెక్కువ వర్గచైతన్యంగల వారు, యెక్కువ ధైర్యసాహసములు, శక్తిసామర్థ్యములు గల కామ్రేడ్స్ యీ పోరాటంలో ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తున్నారు. మొదటిలైనులో నిలబడి పోరాడే వీరినే మన శత్రువులు వేటాడి చంపుతారు. జైళ్ళలోనూ, కాన్సెన్ట్రేషన్ క్యాంపులలోనూ బంధిస్తారు. ముఖ్యంగా ఫాసిస్టు దేశాలలో వీరిని కౄరమైన ఘాతుక హింసాచర్యలకు గురిచేస్తారు. అందువల్ల నష్టపడు తున్నవారి స్థానములను ఆక్రమించుటకై మన సైన్యాలను తిరిగి నింపుకొనవలసియున్నది. అందుకని నూతన కాడర్లకు యెల్ల ప్పుడూ శిక్షణనిచ్చి, తయారు చేసుకొనవలసి యున్నది. దానితో పాటు ప్రస్తుతం నిలిచియున్న కాడర్లను భద్రపరచుకొనవలసి యున్నది.

కాడర్ల సమస్య తక్షణ సమస్యగా పరిగణించుటకు మరియొక కారణం వున్నది. ఈనాడు మన పలుకుబడికింద బ్రహ్మాండ మైన ప్రజా ఐక్యసంఘటన జరుగుతున్నప్పుడు వేలకువేలుగా క్రొత్త కార్మిక మిలిటెంట్స్‌తో సంబంధాలు వస్తున్నాయి. అంతేకాదు. పూర్వం రాజకీయ ఉద్యమాల్లో పాల్గొనకుండా యిప్పుడు విప్లవ కారులుగా తయారైన యువకులు కార్మికులే కాదు మన పార్టీలోకి వస్తున్నది. పూర్వం సోషల్ డెమాక్రాటిక్ పార్టీలతో సంబంధం కల్గియున్నవారుగూడా తరచుగా మనపార్టీ లోకి రావటం జరుగుతోంది. ఈ నూతన కాడర్ల విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. ముఖ్యంగా రహస్యంగా పనిచేస్తున్న కమ్యూనిస్టుపార్టీలు వీరినిగురించి జాగ్రత్తగా శ్రద్ధవహించవలసి యున్నది. ఎందుకంటే యెక్కువగా రాజకీయస్థాయి లేకపో వుటవల్ల తీవ్రమైన రాజకీయ సమస్యలు వచ్చినప్పుడు వీరు అడ్డుగా తయారుకాగలరు.

మన పార్టీలకు, యువక కమ్యూనిస్టు సంఘాలకు, యితర ప్రజా సంస్థలకు - మొత్తం విప్లవ కార్మిక ఉద్యమానికే - ఈ కాడర్ల సమస్యయందు అనుసరించవలసిన సరియైన వైఖరి ప్రధాన విషయంగా తయారైంది.

కాడర్లయందు సరియైన పంథా యేమిటి?

(1) తన ప్రజలను తెలుసుకొనుట మొదటి విషయం. నిజానికి మనపార్టీలో కాడర్లను పరిశీలించుటకు ఒక పద్ధతి అనేది లేదు. ఈ మధ్యనే ఫ్రాంసు, పోలెండు, చైనా దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీలు ఈ విషయంలో కొంతవరకు విజయాన్ని సాధించినాయి. రహస్య దశ ప్రారంభం కాకపూర్వం జర్మన్ కమ్యూనిస్టుపార్టీ కాడర్లను పరిశీలించుటకు కొంత కృషిచేసింది. ఈ పార్టీలు ప్రజలను పరిశీలించుట ప్రారంభించగానే ఒక నూతన విషయం తెలిసింది. పూర్వం నిరాడంబరముగా ఎవరికీ తెలియకుండా ఉన్న పార్టీ వర్కర్లు ఇప్పుడు బయటపడ్డారు. ఇది ప్రజలను పరిశీలించుటవల్ల తెలిసిన విషయం. ఇక పార్టీలను పరిశీలించుటవల్ల, రాజకీయంగానూ సిద్ధాంతరీత్యా ప్రమాదకరమైన సభ్యులను పార్టీనుంచి వెళ్ళగొట్టటం జరిగింది. క్లోరే, బార్బే ఉదాహరణలు చూడండి. బోల్షివిక్ సూక్ష్మ దర్శనయంత్రంతో పరిశీలించుటవల్ల వారిద్దరూ మన వర్గశత్రువుల ఏజెంట్లుగా బయటపడి పార్టీనుంచి బయటికి వెళ్ళగొట్టబడ్డారు. పోలెండు, హంగెరీ దేశాల్ల పార్టీల అనుభవంవల్ల ప్రభుత్వ ఏజెంట్ల ముఠాలు, శత్రువుల ఏజెంట్లు బయటపడి వెళ్ళగొట్టబడ్డారు.

(2) కాడర్లను సరిగా ప్రమోట్ చేయుట రెండవ విషయం. ఏదో ఒకసమయంలో ఆకస్మికంగా ప్రమోట్ చేయుటగాక, పార్టీ యొక్క మామూలు కార్యక్రమంలో ప్రమోట్ చేయుటగూడా

ఒక భాగమై ఉండాలి. ప్రజలలో పార్టీసభ్యులకుగల పలుకుబడిని బట్టి లేక వారి ప్రత్యేక బాధ్యతలలో వారు చూపించే గుణగణా లనుబట్టి ప్రమోట్ చేయుట సరియైనదికాదు. ప్రమోట్ చేయుట వల్ల అద్భుత ఫలితాలువచ్చిన ఉదాహరణలు మనపార్టీలో చాలా ఉన్నాయి. ఉదాహరణకు - ఈ సమావేశంలో హాజరవుతున్న స్పానిష్ మహిళా కమ్యూనిస్టు కామ్రేడ్ డిలోరెస్‌ను చూడండి. 2 సంవత్సరాలక్రితం ఆమె పార్టీలో ఒక మామూలుసభ్యురాలుగా ఉండేది. కాని వర్గశత్రువులతో ప్రారంభమైన ప్రథమపోరాటాల్లో ఆమెయొక్క పోరాట ఆందోళనాశక్తి రుజువు చేయబడింది. తరువాత పార్టీ కేంద్రకమిటీకి ఆమె ప్రమోట్ చేయబడింది. ప్రమోషన్ తరువాత కేంద్రకమిటీ సభ్యురాలుగా తన అర్హతను సార్థకంచేసింది.

ఇటువంటి ఉదాహరణలు ఇతరదేశాల చరిత్రలనుంచి ఎన్నో ఇవ్వగలను. కాని ఈ ప్రమోషన్లన్నీ ఒక పద్ధతి ననుసరించి గాక ఇష్టంవచ్చినట్లు చేయబడినాయి. అందువల్ల కొన్నిసమ యాల్లో ఆశించిన ఫలితాలు రాలేదు. ఒక్కొక్కప్పుడు నీతిబోధ కులు, కబుర్లరాయుళ్ళు, వాగుడుగాళ్ళు - ఆశయానికి ప్రమాదం తెచ్చేవారిని నాయకస్థానాలకు ప్రమోట్ చేయుట జరిగింది.

(3) పార్టీ సభ్యులను సాధ్యమైనంత ఎక్కువ ప్రయోజన ములకై ఉపయోగించుట మూడవవిషయం.

ప్రతిఒక్క పార్టీసభ్యునియొక్క గుణగణాలను కనుగొన గల్గి వాటిని ఉపయోగించుకొనగల్గి ఉండాలి. లోపాలులేని అతీ తులు ఎవరూలేరు. ఉన్నవారిని ఉన్నట్లుగా ఎంచి, వారి బలహీ నతలను, లోపాలను సవరించుటకు ప్రయత్నించాలి. మంచి నమ్మకస్థులైనటువంటి శక్తివంతులైన కమ్యూనిస్టు లెందరో, ఉపయోగపడ గల్గినంతగా ఉపయోగ పడనటువంటి ఉదాహర

రణలు చాలా ఉన్నాయి. వారికి తగినపనిని ఇచ్చియున్నట్లయితే ఎక్కువగా ఉపయోగపడి యుండేవారు.

(4) కాడర్లను సరిగా విభజించుట నాల్గవ విషయం. ఉద్యమంలోని కీలకస్థానాలను ఆక్రమించేవారు ప్రజలతో సంబంధం కల్గి ప్రజలలోనుంచి వచ్చిన దృఢమైనవారుగానూ, చొరవగల్గిన శక్తివంతులైన వారుగానూ ఆయి ఉండాలి. ముఖ్యమైనజిల్లాలు అటువంటివారిని ఎక్కువగా కల్గి ఉండాలి. పెట్టుబడి దేశాలలో కాడర్లను ఒక ప్రదేశంనుంచి మరొక ప్రదేశానికి మార్చుట సులభమైన విషయంకాదు. ఆలా చేయాలంటే ఫండ్స్ లేకపోవుట, కుటుంబసమస్యలు మొదలైన సమస్యలెన్నో అడ్డం వస్తాయి. ఈఅడ్డంకులను ఆలోచించి సరియైన మార్గాలలో దాటుటకు బదులు సాధారణంగా వాటిని లెక్కలోకి తీసుకొనకుండా అజాగ్రత్తగా ప్రవర్తిస్తాం.

(5) కాడర్లకు ఒకపద్ధతిలో సహాయపడుట తరువాత విషయం. జాగ్రత్తగా సూచనలిచ్చుట, కామ్రేడ్ భావంతో కంట్రోల్‌చేస్తూ, లోపాలను, తప్పులను సవరించుట, దైనందినసమస్యలలో సరియైన సూచనలతో నడుపుట - ఇవన్నీ కాడర్లకు యివ్వ వలసినసహాయం.

(6) కాడర్లను జాగ్రత్తగా భద్రపరిచి, పోషించుట చివరి విషయం. పార్టీ వర్కర్లను వెనక్కు లాగవలసిన పరిస్థితులలో సకాలంలో వారిని వెనక్కు లాగి, వారి స్థానాల్లో యితరులను నియమించుట నేర్చుకోవాలి. ముఖ్యంగా పార్టీలు రహస్యంగా పని చేస్తున్న దేశాల్లో కాడర్లను భద్రపరచే విషయములో పార్టీలమీద బ్రహ్మాండమైన బాధ్యత వున్నది. రహస్యంగా పోవలసివచ్చిన సమయంలో జర్మన్ కమ్యూనిస్టుపార్టీ పొందిన విపరీత నష్టం జ్ఞాపకంలేదా ?

కాడర్ల సమస్యయందు సరియైన దృక్పధం కల్గి ఉన్నప్పుడే మన పార్టీలు తమ శక్తులన్నింటిని సాధ్యమైనంత యెక్కువగా అభివృద్ధిచేస్తూ, ప్రజా ఉద్యమంలోనుంచి ఎప్పటికప్పుడు మంచి మంచి కొత్త వర్కర్లను సంపాదించగలవు.

కాడర్లను సెలక్టు చేయటం యెలా ?

(1) కార్మికవర్గ ఆశయమన్నా. పార్టీ అన్నా అకుంఠ నమ్మకం, విశ్వాసం వుండాలి. ఈ నమ్మకం పోరాటాల్లోగాని, జైలులోగాని, కోర్టులోగాని పరీక్ష చేయబడినదై వుండాలి.

(2) ప్రజలతో సాధ్యమైనంత దగ్గర సంబంధాన్ని కల్గి వుండాలి. ప్రజా కోర్కెలలో నిమగ్నులై, ప్రజా జీవితనాడిని తెలుసుకొని, ప్రజల స్వభావ అవసరాలను గుర్తెరింగి ఉండాలి. మన పార్టీ నాయకులను తమ నాయకులుగా ప్రజలు పరిగణించుటమీదనే పార్టీ నాయకుల ప్రతిష్ట ఆధారపడియున్నది. అంతే గాక, తమ అనుభవంలో ప్రజలకు పార్టీ నాయకులయొక్క శక్తి, పోరాటంలో నిశ్చలత్వం, స్వార్ధరహిత స్వభావములలో నమ్మకం యేర్పడాలి.

(3) స్వతంత్రంగా తనయొక్క శక్తిసామర్ధ్యములను గుర్తెరింగి, నిర్భయంగా నిర్ణయాలను తీసుకొనుటలో బాధ్యతవహించే శక్తి వుండాలి. బాధ్యతను తీసుకొనుటకు భయపడేవాడు నాయకుడుకాడు. చొరవ చూపెట్టకుండా "నాకుచెప్పిన పనినిమాత్రం చేస్తాను" అనే వ్యక్తి బోల్షివిక్ కాజాలడు. అపజయ సమయాల్లో పిచ్చెత్తకుండా విజయాలు సాధించినప్పుడు తల తిరగకుండా నిర్ణయాలను అమలుచేయుటలో నిశ్చలత్వాన్ని నిరూపించేవాడే బోల్షివిక్. కొన్ని పోరాట సమస్యలను స్వతంత్రంగా పరిష్కరించే స్థానంలోవుండి, హాకు చేయబోయే నిర్ణయాలకు

వారే పూర్తి బాధ్యత వహించాలని తెలుసుకున్నప్పుడే కాడర్లు అభివృద్ధి అవుతూ పెరుగగలవు.

(4) పోరాటంలో నిరూపించబడే బోల్షివిక్ శిక్షణనుబట్టి కాడర్లను సరిగా సెలక్టు చేయగల్గుతాము. సాధారణంగా జరిగేది చూడండి. వ్రాయటం, మాట్లాడటం, బాగా తెలియనప్పటికీ ప్రజలతో సంబంధం కల్గి, మంచి చొరవతో పోరాటంలో ప్రవేశించగల్గి యితరులనుగూడా పోరాటంలో నడుపగలిగిన కామ్రేడ్ కంటె, బాగా వ్రాయగల్గి, మంచి ఉపన్యాస శక్తిగల కామ్రేడునే ముందు సెలక్టుచేయటం జరుగుతుంది. ఇది చాల పొరబాటు. నమ్మకస్తులైన ప్రజా సేవకులమీద, నిజమైన కార్మికవర్గ నాయకులమీద, పెత్తనంచేసే నీతిబోధకులు ప్రొఫెసర్లు యెంతమంది లేరు?

నాయకత్వం వహించే మన కాడర్లన్నీ తాము ఏమిచేయాలో తెలుసుకొనుటతోపాటు బోల్షివిక్ నిశ్చలత్వం, నైతిక విప్లవ శక్తి, తమ కర్తవ్యాన్ని సాధించే మనోబలాన్ని....కల్గివుండాలి.

కామ్రేడ్స్, పోరాట మార్గంలోనే కాడర్లకు ఉత్తమ శిక్షణ లభిస్తుందని, అడ్డంకులను యెదుర్కొనుటలోనూ, పరీక్షలకు నిలబడుటలోనూ, మంచి చెడు ప్రవర్తనలను సూచించే ఉదాహరణలవల్లనూ ఉత్తమ శిక్షణ లభిస్తుందని మీకు తెలుసును. సమ్మెలు జరిగేటప్పుడు, ప్రదర్శనాల సమయంలో, జైళ్ళలో, కోర్టులలో అద్భుతమైన ప్రవర్తనకు యెన్నో వందల ఉదాహరణలు వున్నాయి. వీరత్వాన్ని సూచించే ఉదాహరణలువున్నాయి. అనిశ్చలత్వానికి, ఊగులాడే స్వభావానికి, చివరికి పార్టీని వదలిపెట్టిన ఉదాహరణలుగూడా వున్నాయి. ఉదాహరణలు మంచివైనా, చెడువైనా సాధారణంగా మనం మరచిపోతూ వుంటాం. ఈ వుదాహరణలవల్ల వచ్చే నీతిని బోధించుటగూడా మరచి

పోతూవుంటాం. దేనిని హర్షించి ఆదర్శంగా వుంచుకోవాలో, దేనిని నిరాకరించి గర్హించాలోగూడ మనం చూపించం. వర్గ పోరాట సమయాల్లో, పోలీసుల పరీక్షలలో, జైళ్ళలో, కాన్సెన్ ట్రేషన్ క్యాంపులలో మన కామ్రేడ్సుయొక్క ప్రవర్తనను పరిశీలించాలి. వాటిలో మంచి ఉదాహరణలను ఆదర్శకరంగానూ, బోల్షివిక్ లక్షణంకాని అసహ్య ప్రవర్తనలను ఖండించతగినవిగానూ నిరూపిస్తూ వుండాలి.

* లైప్‌సిగ్ విచారణ మొదలుకొని ఇప్పటివరకూ బూర్జువా, ఫాసిస్టు కోర్టులలో మన కామ్రేడ్స్ యెందరో యిచ్చిన స్టేట్ మెంటులనుచూస్తే కోర్టులలో బోల్షివిక్ ప్రవర్తన ఎలావుండాలో గ్రహించిన అసంఖ్యాకమైన కాడర్లు వృద్ధి అవుతున్నవని తెలుస్తుంది.

రుమేనియాలో జరిగిన రైల్వే కార్మికుల విచారణనుగురించి జర్మనీలో విచారణచేయబడి తరువాత ఉరితీయబడిన 'ఫీచేషూల్జ' విచారణను గురించి, ధైర్య సాహసుడైన మన జపానీస్ కామ్రేడ్ అయిన 'ఇతికావా' విచారణనుగురించి, బల్గేరియావిప్లవ సైనికుల విచారణను గురించి, ఆదర్శకరమైన యితర కార్మిక వీరులయొక్క విచారణలను గురించి యీ సమావేశ ప్రతినిధులలో యెంతమందికి తెలుసును?

కార్మిక వీరత్వమునకు సార్థక ఉదాహరణలైన వాటిని ప్రజలలో యెక్కువగా ప్రచారము చేయాలి. అధైర్యం, ఊగులాటలను సూచించే అసహ్యాకరమైన ఉదాహరణలతో వాటిని పోల్చి

* 1933 లో జర్మన్ రైస్టాగ్ భవనాన్ని నాజీలు తగులబెట్టి, కమ్యూనిస్టులు తగులబెట్టారని కేసుపెట్టారు. కామ్రేడ్ డిమిట్రావ్ ముద్దాయిలలో ఒకడు. ముద్దాయిలు ఫాసిస్టుల కుట్రను కోర్టులో భగ్నంచేశారు. ముద్దాయిలను విడుదల చేయవలసి వచ్చింది.

ప్రజలను ఉత్తేజపరచాలి. కార్మిక ఉద్యమంలోని కాడర్లకు ముఖ్యంగా యీ ఉత్తేజకరమైన ఉదాహరణలను యెక్కువగా ప్రచారం చేయాలి.

కామ్రేడ్స్, పనిచేసేవారు లేరని, ఆందోళనా ప్రచార కార్యక్రమానికి, పత్రికా నిర్వహణకు, కార్మికసంఘాలపనికి, యువజన మహిళాసంఘాల కార్యక్రమానికి చాలినంతమంది వర్కర్లు లేరని సాధారణంగా మనపార్టీనాయకులు కంప్లెయింటుచేస్తూవుంటారు. చాలటంలేదు, చాలటంలేదు - ఇదే వీరి గోడు. మాకు వర్కర్లు లేనే లేరు! దీనికి ఎప్పుడో లెనిన్ చెప్పిన నినాదం ఈ నాడు గూడా వర్తిస్తుంది :-

"మనుష్యులు లేరు - అయినా అసంఖ్యాకులైన మనుష్యులు ఉన్నారు. ప్రతి సంవత్సరం నిరంకుశ ప్రభుత్వమంటే అసంతృప్తిచెందినవారు కార్మికవర్గంనుంచి, ఇతర ప్రజాసామాన్యం నుంచి అసంఖ్యాకులుగా బయలుదేరి, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో వారికి చేతనైనంత సహాయం ఇచ్చుటకు సిద్ధమవుతున్నప్పుడు - మనకు కావలసినంతమంది తప్పక ఉన్నారు. చాలినంతమంది లేరనుటలో అర్థంలేదు. నిరంకుశత్వాన్ని భరించుట అసాధ్యమని అందరూ గుర్తించక పోవచ్చును. కాని అసంతృప్తి ఎక్కువ అవుతున్న వారిసంఖ్య రోజురోజుకు వృద్ధి అవుతోంది. అయినప్పటికి మనకు మనుష్యులులేరు - కారణం? ప్రజలను సరిగా ఆర్గనైజ్ చేయగల్గిన నాయకులు లేకపోవుటయే నిజమైన కారణం. అన్నిశక్తులను, చివరికి బహుకొద్దిపాటి సహాయం ఇవ్వగలిన వ్యక్తులనుగూడా ఉపయోగించుకుంటూ బాహుళ్యంగా ఆర్గనైజ్ చేయగల్గిన నాయకులు లేకపోవుటయే దీనికి కారణం."

(లెనిన్ : "ఏం చెయ్యాలి?")

లెనిన్ చెప్పిన ఈ మాటలను మన పార్టీలన్నీ పూర్తిగా గ్రహించి, వారి దైనందిన కార్యక్రమంలో వర్తింపజేయాలి. మనుష్యులు కావలసినంతమంది ఉన్నారు. వివిధ ప్రజాసంస్థల లోనూ, సమ్మె, ప్రదర్శన సమయాల్లోనూ, వివిధ కార్మిక సంస్థలలోనూ. ఐక్యతా సంఘటన కమిటీలలోనూ వారిని కనుగొనవలసియున్నది. కనుగొన్నతరువాత కార్యక్రమంలో పోరాటంద్వారా వారిని అభివృద్ధిచేయుటకు మనంసహాయపడాలి. కార్మిక ఆశయానికి వారుగూడా తోడ్పడునట్లుగా వారిని వారికి తగినస్థానాల్లో పెట్టేబాధ్యత మనది.

కామ్రేడ్స్, కమ్యూనిస్టులమయిన మనం కార్యాచరణకు దీక్ష బూనినవారం. పెట్టుబడిదారులకు, ఫాసిజానికీ, సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా పోరాడి పెట్టుబడి విధానమును కూల ద్రోయుటయే మన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చుటకై కమ్యూనిస్టు కాడర్లను విప్లవ సిద్ధాంతాల్లో శిక్షణ ఇచ్చి తయారు చేయవలసి యున్నది. విప్లవ కార్యాచరణకు నాయకుడైన కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లుగా, కార్యరంగంలో పనిచేస్తున్న కామ్రేడ్స్‌లో స్పష్టమైన దృష్టి, పనిలో నిశ్చలత్వం, మన ఆశయానికి విజయం చేకూరక తప్పదనే నమ్మకకల్గించి స్వతంత్రశక్తిని అభివృద్ధిచేయుటకు సిద్ధాంత విజ్ఞానం అవసరం.

కాని నిజమైన విప్లవ సిద్ధాంతజ్ఞానం, పరిస్థితులతో సంబంధం లేని గొడ్డు సిద్ధాంతసూత్రాలకు శుద్ధవ్యతిరేకం. 'మన సిద్ధాంతం ఒక మంత్రం వంటిది గాక కార్యాచరణకు మార్గదర్శకంగా ఉంటుంది.' (లెనిన్). అటువంటి సిద్ధాంతమే మన కాడర్లకు కావాలి. జీవించుటకు తిండి. గాలి, నీరు ఎలా కావాలో అలాగే మన కాడర్లకు అటువంటి విప్లవసిద్ధాంతం అవసరం.

జీవంలేని కాగితపు ప్లానులనుంచి, గొడ్డుపోయిన పండిత సిద్ధాంతాలనుంచి మన కార్యక్రమాన్ని తప్పించి పనిచేయాలంటే, ప్రజలతో కలిసిపోయి, ప్రజలకు ముందు నిలబడి దైనందిన పోరాటరంగంలో పనిచేస్తూ మార్క్సు, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్‌లయొక్క రసవత్తరమై, మహత్తర శక్తితోకూడిన బోధలను సమగ్రంగా గ్రహించుటకు సర్వశక్తులూ వినియోగించాలి.

ఈ సందర్భంలో మన పార్టీ స్కూళ్ళయందు వుండవలసినవైఖరినిగురించి చెప్పుట అవసరం. మన స్కూళ్లు పండితుల నీతిబోధకులకుకాదు శిక్షణ ఇచ్చేది. కార్యరంగంలో ప్రథమశ్రేణిలో నిలబడి పోరాడేవారు, సామాన్యసభ్యులకంటె ధైర్య సాహసములుకల్గి, సామాన్య సభ్యులకంటె దూరదృష్టి కల్గి శ్రమజీవుల విముక్తి మార్గాన్ని తెలుసుకున్నవారు గూడా పార్టీ స్కూళ్ళలో శిక్షణ పొందాలి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌యొక్క అన్నిశాఖలు వెంటనే పార్టీ స్కూళ్ళను సరియైన పద్ధతిలో ఆర్గనైజ్‌చేసి పోరాటకారుల్ను పోతపోసే కేంద్రములుగా తయారుచేయాలి.

మన పార్టీ స్కూళ్ళ యొక్క ప్రధాన కర్తవ్యం యేమిటి? పార్టీ సభ్యులకు, యువక కమ్యూనిస్టులకు తమ తమ దేశాల్లోని ప్రత్యేక పరిస్థితులకు మార్క్సిస్టు - లెనినిస్టు పద్ధతిని యెలా వర్తింపచేయాలో చెప్పాలని నా అభిప్రాయం. జనరల్‌గా శత్రువుకు వ్యతిరేకంగా యెలా పోరాడాలోగాక, నిర్ణీత శత్రువుకు యెలా వ్యతిరేకంగా పోరాడాలో తెలియజేయాలి. దీనికి లెనినిస్టు సిద్ధాంతాలను అక్షరాలా చదువుకుంటే లాభంలేదు. లెనినిజమ్‌లోని విప్లవ సారాంశము గ్రహించినప్పుడే సరియైన పద్ధతిలో చెప్పగలం.

మొదటి పద్ధతి :- పరిస్థితులకు సంబంధించని సిద్ధాంతాన్ని చెప్పుట. వీలైనంత యెక్కువగా గొడ్డుసిద్ధాంతాన్ని బోధించి, సాహిత్యశైలిలో ప్రణాళికలను తీర్మానాలను తయారుచేసే పద్ధతినిచెపుతూ, ఆ ప్రత్యేక దేశమునకు సంబంధించిన సమస్యను గురించి, ఆ దేశముయొక్క కార్మిక ఉద్యమం, చరిత్ర, సాంప్రదాయాలు, కమ్యూనిస్టు పార్టీ అనుభవాలనుగురించి యేదో చూచాయగా ముట్టుకొని వదలివేయటం.

రెండవ పద్ధతి ;— తనదేశములోని కార్మికపోరాటంలోని కీలక సమస్యలను పరిశీలించుటయే ఆధారంగా తీసుకొని మార్క్సిస్టు-లెనినిస్టు మూలసూత్రాలను గట్టిపరిచే సిద్ధాంత శిక్షణ రెండోపద్ధతి. ఇలా చేసినట్లయితే, విద్యార్థి తన కార్యరంగానికి వచ్చిన వెంటనే స్వతంత్రంగా తన స్థితిని తెలుసుకొనగల్గి, వర్గ శత్రువుకు వ్యతిరేకంగా చేసేపోరాటంలో ప్రజలను నడపగల్గిన నాయకుడుగానూ, స్వతంత్ర ఆర్గనైజర్‌గానూ తయారవుతాడు,

పార్టీ స్కూళ్ళలో తయారైన వారందరూ పనికివస్తారని చెప్పుటకు వీలులేదు. పుస్తక జ్ఞానం, గొడ్డుబోయినసిద్ధాంతాలు, పాండిత్య అభినయం ఎక్కువమందిలో ఉంటుంది. కాని మనకు కావలసింది ప్రజలను నడుపగల్గిన నిజమైన బోల్షివిక్ నాయకులు. వారు మంచి ప్రణాలికలను తయారుచేయలేకపోయినా ఫరవాలేదు. (అదిగూడా మనకు ప్రధానమైనప్పటికి) కష్టాలనుఎదుర్కొంటూ, నిర్భయంగా ఆర్గనైజ్‌చేసి నడుపగలశక్తిని సంపాదించగల్గిఉన్న వారే మనకు కావాలి.

విప్లవ ఉద్యమంయొక్క అనుభవ సంగ్రహమే విప్లవ సిద్ధాంతం, కమ్యూనిస్టులు తమ దేశములలోని గత అనుభవాన్నే గాక, అంతర్జాతీయ కార్మిక ఉద్యమంయొక్క ప్రస్తుత అనుభవాన్నిగూడా ఉపయోగించగల్గి వుండాలి. అనుభవాలను సరిగా

ఉపయోగించుకున్నంతకాలం, ఒక పరిస్థితిలోని పోరాట పద్ధతులను మరొక పరిస్థితికి ఒకదేశమునుంచి మరొక దేశమునకు దిగుమతి చేయుట కానేరదు. అనుభవాన్ని సరిగా ఉపయోగించుకొనుట అనేక సమయాల్లో ప్రస్తుతం జరుగుటలేదు.

కేవలం ఉన్నదిఉన్నట్లుగా అనుకరించుట, పద్ధతులను, రూపాలను కాపీచేయుట, చివరికి పెట్టుబడి దేశాల్లోగూడా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీయొక్క పద్ధతులను అనుకరించుట గూడా జరుగుతోంది. ఉద్దేశ్యములు ఎంతమంచివైనా, ఈ అనుకరణవల్ల చెడ్డ ప్రమాదం రాగలదు. మనదేశ ప్రత్యేక పరిస్థితులకు ఒకే ఒక అంతర్జాతీయ పంథాను ఎలా వర్తింపచేస్తే సఫలీకృతమవుతుందో రష్యన్ బోల్షివిక్కుల అనుభవాన్నుంచి మాత్రమే తెలుసుకోవాలి. పెట్టుబడి విధానమునకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో, మంత్రాలకు, పండిత సూత్రాలకు, అభినయాలకు నిర్దాక్షిణ్యంగా చోటివ్వరాదు.

కామ్రేడ్స్, ప్రతిక్షణమూ, పోరాటంచేసే సమయంలో, జైలులో బంధించబడినప్పుడు, బయట స్వేచ్ఛగా ఉన్నప్పుడు - ఎల్లప్పుడూ నేర్చుకొనుట మానరాదు. నేర్చుకుంటూ పోరాడాలి. పోరాడుతూ నేర్చుకోవాలి. పోరాటరంగంలో స్టాలిన్‌యొక్క పట్టుదలతోనూ, వర్గ శత్రువునుగాని, పార్టీపంథాను వ్యతిరేకించేవారినిగాని ఎదుర్కొనునప్పుడు నియమాలను పాటించేవిషయములో స్టాలిన్‌యొక్క నిశ్చలత్వంతోనూ, కష్టాలను ఎదుర్కొనునప్పుడు స్టాలిన్‌యొక్క నిర్భయత్వంతోనూ, స్టాలిన్‌యొక్క విప్లవదృక్పథంతోనూ, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్‌ల, మహత్తర బోధను జోడించి పనిచేయుట నేర్చుకోవాలి,



